శ్రీ నారసింహ సంస్కృతకళాశాలా గ్రంథమాల—నెం. 7

# నాగానందము

శ్రీ హర్షమహాకవి సంస్కృతనాటకమున కనువాదము



ఆంధ్రీకర్త

ఉభయభాషా సాహిత్యవిద్యా ప్రవీణ

**పంచాంగము వేంకట నరసింహాచార్యులు**

ఆంధ్ర పండితులు

శ్రీ నారసింహ సంస్కృతకళాశాల

చిట్టిగూడూరు

1936

హిందూప్రెస్, మచిలీపట్టణము

# పీఠిక

శ్రీనారసింహ సంస్కృతకళాశాలా గ్రంథమాల యందు సప్తమగ్రంథముగ శ్రీ హర్షమహాకవిప్రణీతంబగు నాగానందనాటకమున కాంధ్రానువాదమును సహృదయ లోకమునకు సమర్పించుట కెంతయు సంతసించుచున్నారము.

ఈయనువాదమునకుఁ గర్తలగు శ్రీమాన్ పంచాంగము వేంకటనరసింహాచార్యులుగారీగ్రంథమాలలో మొదటిదగు రఘుకులచరితమునకుఁ బ్రణేతలుగఁ బాఠకులకుఁ బరిచిత పూర్వులే. ఆగ్రంథమునందువలెనే యిందును కవితాత్పర్యమునకు భంగము కలుగకుండునట్లు మూలానుసరణము సరసముగఁ జేయఁబడినదని చెప్పవచ్చును. ఇందలి గుణదోషములను సహృదయులు పరిశీలింతురుగాక.

చిట్టిగూడూరు
15_2_36

శ్రీమత్తిరుమల గుదిమెళ్ల వరదాచార్యులు,
యం. ఏ.
శ్రీనారసింహసంస్కృత కళాశాలాధ్యక్షులు.

# ఇందలి పాత్రలు

## పురుషులు

1. జీమూతవాహనుఁడు .. కథానాయకుఁడు
2. జీమూతకేతువు ... నాయకునితండ్రి
3. మిత్రావసువు ... మలయవతిసోదరుఁడు ; విశ్వావసు పుత్రుఁడు
4. శాండిల్యుఁడు ... తాపసుఁడు ; కౌశికశిష్యుఁడు
5. గరుడుఁడు ... నాగశత్రువు
6. శంఖచూడుఁడు ... సర్పజాతిలోనొకఁడు
7. ఆత్రేయుఁడు ... నాయకునినర్మసచివుఁడు
8. శేఖరకుఁడు ... విశ్వావసు పరిజనులలోనొకఁడు
9. చేటుఁడు ... శేఖరకునిభృత్యుఁడు
10. కంచుకి .... విశ్వావసుమహారాజుయొక్క యంతఃపురమునందుండువాఁడు
11. కింకరుఁడు ... నాగరాజుయొక్క భటుఁడు
12. సునందుఁడు ... విశ్వావసుపుద్వారపాలకుఁడు

## స్త్రీలు

1. మలయవతి ... కథానాయిక
2. గౌరి ... మలయవతియొక్క యిష్టదేవత
3. దేవి ... జీమూతకేతునిభార్య
4. వృద్ధ ... శంఖచూడునితల్లి
5. చతురిక
6. మనోహరిక
7. నవమాలిక

(5–7) ... మలయవతిచెలికత్తెలు



శ్రీమతే రామానుజాయ నమః

# నాగానందము



## ప్రథమాంకము



### నాంది

చం॥ తలఁపఁదొడంగి తెవ్వ తెనో ధ్యానమిషంబున మన్మథాస్త్రద
గ్ధలమముఁ జూడుకన్దైఱచి కావవు దక్షుఁడవయ్యు నిర్దయా
త్ముఁడయని మారకామినులు తూలఁగఁబల్కిన నిట్టలంబుగ
న్వోలసిన బుద్ధుఁడెల్లపుడుఁ బ్రీతిని రక్షణసేయు మిమ్ములన్॥ 1

మఱియును—

సీ॥ కర్ణాంతకృష్టమహా కార్ముకంబును బూని
కందర్పుఁడొకవంకఁగాంచుచుండ
హతపటుపటహా వల్గితమారవీరులు
సంచలనమున వీక్షించుచుండ
భ్రూవిలాసంబుల ముసిముసి నగవుల
దేవకాంతామణుల్ తేఱిచూడ
సిద్ధబృందములెల్ల శిరముల్లనవంచి
భక్తితత్పరతను బరఁగిచూడ

గీ॥ విస్మయోత్ఫుల్ల పులకితవిగ్రహుఁడయి
వేయికన్నుల నిందుఁడు విప్పిచూడఁ
దత్త్వసంప్రాప్తి నచలుఁడై ధ్యానయుక్తుఁ
డౌ మునీంద్రుఁడు మిముఁ బ్రోచు ననవరతము. 2

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్ర— ఈ సభ్యులెల్లరును "శ్రీహర్ష మహాకవి సంస్కృత భాషయందు రచించిన నాగానందనాటకమును శ్రీమాన్ పంచాంగము వేంకటనరసింహాచార్యులు గారాంధ్రీకరించి యున్నారని వినియుంటిమేగాని, యయ్యాంధ్రీకృతనాటకం బును బ్రదర్శింపఁగాఁ జూచియుండలేదు. కావున నద్దాని నిపుడు ప్రదర్శింపవలయు"నని యాజ్ఞాపించి యున్నారు. కావుననిపుడే రంగస్థానమలంకరించి వారి యభిలాషము నెఱవేర్చెదను. ఈ నాటక ప్రదర్శనమువలన సభ్యుల మనము లానందాబ్ధి నోలలాడునని నానిశ్చితాభిప్రాయము. ఏలయన—

చం॥ నిపుణగణాగ్రయాయికవి, స్నిగ్ధగుణగ్రహణుల్ సభాసదుల్
విపులను సిద్ధరాజకథ ప్రీతికరంబిఁక మేము నర్తనా [ముల్
నిపుణుల మిందునొక్కటియు నెక్కొనఁజేయును వాంఛితార్థ
ఇపుడు గుణంబులన్నియునునిచ్చటఁగూడుటనాదుభాగ్యమే॥

కావున నిపుడే భార్యను బిలచి సంగీతప్రసంగము నడపెదను.

(పరిక్రమించి తెరవంకఁ జూచి)

కం॥ పరిజన బంధుద్విజహిత !
సరళమృదులశీల ! భవనసరసీహంసా !
పరపురుషచంద్రికమలిని !
సరగునవిటురమ్ము కార్య సఫలత పొంకెన్॥ 4

(నటి కంటఁ దడిపెట్టుచుఁ బ్రవేశించును)

నటి.—ఆర్యా ! ఇదిగో ! వచ్చితిని.

సూత్ర:—(చూచి) ప్రియా ! నాగానందము ప్రదర్శింపవలసిన సంతోషసమయమున నిట్లు కంటఁదడి పెట్టెదవేల ?

నటి :—ఆర్యా ! మీతలిదండ్రులు వార్ధకముకతంబున విరాగులై సమర్థులరగు మీపైఁ గుటుంబరక్షణభారము మోపి తపోవనంబున కరిగినారుకదా ! ఇఁక దుఃఖింపకుండుటెట్లు ?

సూత్ర :— ఏమీ ! నన్నుఁగూడవిడచి తలిదండ్రులు తపోవనంబున కరిగినారా ? అయిన నేనిఁకఁ దలిదండ్రుల శుశ్రూషవలనఁగలుగు సుఖంబుజ్జగించి యింటనే నివసింపఁజాల. కావున నిపుడే—

గీ॥ తల్లిదండ్రుల శుశ్రూష తగనొనర్పఁ
దరతరము లబ్ధమైన యీ ధనగృహములు
వీడి యేగెద నడవికిఁ బ్రీతి ధర్మ
పరుఁడు జీమూతవాహను కరణినిపుడె॥ 5

(ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన



# నాగానందము



## ప్రథమాంకము



(జీమూతవాహనుఁడును, ఆత్రేయుఁడును బ్రవేశింతురు)

జీ. వా.—

మ॥ అనురాగాస్పదమం చెఱుంగుదును నేనత్యంతమున్ ధ్వంసియం
చునుగార్యంబు నకార్యమన్న తెలవిన్ శూన్యంబుఁగావించుని
ట్లనయంబింద్రియ వశ్యవాపరువ మాహానింద్యమయ్యౌ బ్రియం
బునగుందండ్రిని దల్లి భక్తినిటులేఁ బూజింపఁగాఁగల్గినన్॥

ఆత్రే — (కోపమున) వయస్యా! జీవన్మృతప్రాయులగు నీ వృద్ధుల కొఱకింత కాలమునుండియునిట్లు వనవాసదుఃఖ మనుభవించుచున్నను నీకు విసుపుజనింపలేదు. నామాట వినుము. ఇఁకనైనను గురుజనశుశ్రూషానిర్బంధము తొలఁగించుకొని, స్వేచ్ఛోపభోగరమణీయంబగు రాజ్య సుఖం బనుభవింపుము.

జీ. వా.— మిత్రమా! నీవుచెప్పినది యుక్తముగలేదు. ఏలయన—

సీ॥ తల్లిదండ్రులమ్రోలఁ దనరెడు తేజంబు
సింహాసనంబునఁ జెందఁగలదె?
పితరులపాదముల్ ప్రీతినొత్తు సుఖంబు
పరిపాలనంబునఁ బడయఁగలదె?

పితృభుక్తశేషంబు పైఁగలసంతృప్తి
భుక్తోజ్ఝితంబగు భూమిఁగలదె ?
"నాస్తితత్వంగురోః" రన్యత్ర నెడుసూక్తి
వీటిఁబుచ్చియుఁగడు వెడఁగుమతిని

గీ॥ రాజ్యపాలనమునకుఁ దాఁబ్రాకులాడు
వాని జన్మమెందైనను మానితంబె ?
గురుల శుశ్రూషకంటెను గురుతరమగు
ధర్మమితరంబు లేదండ్రు తత్త్వవిదులు. 7

ఆత్రే :— (తనలో) ఆహా ! యీతని గురుజన సేవాతత్పరత్వ మెంతయు శ్లాఘ్యము. (ఆలోచించి) అయిన నిట్లు వచియించె దను. (ప్రకాశముగ) వయస్యా ! రాజ్యసౌఖ్యములను గూర్చి మాత్రమే నేనిట్లు చెప్పుటలేదు. చేయఁదగిన కృత్యము నీకు వేంఱొండు కలదుగదా !

జీ. వా.— చెలికాఁడా ! చేయఁదగిన దానినెల్లఁ జేసితిని. చూడుము

చం॥ ప్రకృతులు ధర్మవృత్తులిల బంధువులెల్లరు మత్సమానులే
సకలసుధీగణంబు సుఖ సక్తము రాజ్యము రక్షితంబు యా
చకులకుఁ గోర్కెకెక్కువ యొసంగెడు కల్పకుజంబుదత్తమే
నిఁకనిటఁ జేయఁగాఁదగిన దెద్దియొ నీమదినున్నఁ దెల్పుమా.

ఆత్రే :— వయస్యా ! నీశత్రువగు మతంగదేవహతకుఁడు మిక్కిలి సాహసము గలవాఁడు. అతఁడు సమీపమున నుండఁ బ్రధానామాత్యపరిరక్షితంబయ్యును నీవు లేనిచో

రాజ్యము స్థిరముగ నుండదని నాకుఁ దోఁచు చున్నది.

జీ. వా.—మిత్రుఁడా! మతంగుఁడు రాజ్యము గ్రహించునని శంకించుచుంటివాయేమి? అట్లయినచో నది సమ్మతమే కదా! చూడుము. నాశరీరము మొదలు సర్వము పరార్థము గనే పరిపాలించుచున్నాను. తండ్రియానతి మీఱ రాకుండుటచే స్వయముగ నీయఁజాలకుంటిని. కావున నిస్సారంబగు రాజ్యపాలనంబునుగూర్చిన ప్రసంగమునలన నేమిప్రయోజనము కలదు? తండ్రిగారియాజ్ఞ నెఱవేర్చు టయే యుచితము. అదియటుంచి ప్రకృతము వినుము. నేఁడు మాతండ్రిగారు "వత్సా! జీమూతవాహన! చాల రోజు లిటనుండుటచేత సమిత్కుశకుసుమాదులు దుర్లభము లగుచున్నవి. మఱియు నీప్రదేశంబునఁగల కందమూల ఫలనీవారాదిపదార్థజాతంబెల్ల నుపభుక్తప్రాయంబు. కాన మలయపర్వతంబున కేగి యచ్చట నివాసయోగ్యంబగు నాశ్రమ ప్రదేశంబు నేర్పఱుపు" మని యానతిచ్చినారు. కావున నిపుడే మలయపర్వతమునకుఁ బోవుదమురమ్ము.

(ఇద్దఱును నడతురు)

ఆత్రే:—వయస్యా! సరసఘనస్నిగ్ధ చందనవనోత్సంగ పరిమిళన లగ్నబహుళ పరిమళంబును, విషమతటపతనజర్జరీకృయ మాణ నిర్ఝరోచ్ఛలితశిశిరశీకరాసారవాహియు నగు మలయమారుతంబు ప్రథమసంగమోత్కంఠితప్రియాకంఠా శ్లేషంబువలె మార్గాయాసం బపనయించుచుఁ బ్రియ వయస్యునికి రోమాంచము గలిగించుచున్నది. విలోకించితే!

జీ. వా. —(చూచి) అప్పుడే మలయపర్వతమునకే చేరితిమే! (నలువంకలఁ గలయఁ జూచి) ఆహా! మలయాచల రామణీయకం బెంతయు శ్లాఘ్యము గదా!

సీ॥ మాద్యద్దాశాగజ మహితగండస్థలీ
కషణభగ్నస్రవ ద్గంధకుజము
శిఖరి గుహాసక్త సింహశార్దూలాది
గర్జిత ప్రతిశబ్ద ఘనతుములము
ఘుమఘుమార్భటితోడ ఘూర్ణిల్లు జలనిధి
తరఁగమొత్తములచేఁ దాడితంబు
సిద్ధకాంతాజన స్వేచ్ఛాక్రమకాంత
చరణలాక్షారక్త చంద్రశిలము
గీ॥ మాదృశులకెల్ల సేవ్యమా మలయశిఖరి
వీతరాగంబు పితృభక్తివిహ్వలంబు
నయిన నామానసంబున కహహ! యెదియొ
యుత్సుకత్వంబుఁ గలిగించుచున్నదిపుడు. 9

మిత్రమా! నివాసయోగ్యంబైన యాశ్రమప్రదేశంబు నరయుదము రమ్ము.

(పర్వతమెక్కుట నభినయింతురు)

జీ. వా. — (నిమిత్తమును సూచించుచు) ప్రియసఖుఁడా!

గీ॥ అదరుచున్నది కుడికన్ను, హృదయమందు
లేశమేనియు ఫలకాంక్ష లేదు, నిజము
మునిజనుల వాక్యములు సత్యములు తలంప
దీనఁగల్గు ఫలంబేమొ? తెలియదుగద. 10

ఆత్రే:—చెలికాఁడా! నీకుఁ గళ్యాణసమయ మాసన్నమయినట్లే శుభశకునంబువలనఁ దెలియుచున్నది.

జీ. వా. — నీవు వచించినది నిక్కమే కావచ్చును.

ఆత్రే :— (సంతోషముతో) మిత్రమా! దట్టమగు వృక్షంబులచేఁ బ్రకాశించుచు, నాద్యాదిహవిర్గంధయుక్తంబై, మిన్నుముట్టెడి ధూమంబుగల్గి, నిర్భయంబుగ మార్గంబునఁ బరుండి నిద్రించు గోవ్యాఘ్రాదిమృగభూయిష్ఠంబగు నీప్రదేశము తపోవనంబని తోఁచుచున్నది.

జీ. వా. — మిత్రమా! చక్కఁగా గుర్తించితివి. ఇయ్యది తపోవనంబేయగు. ఏలయన—

మ॥ తరుచర్మంబులు వల్కలంబులకుఁ గృత్తంబుల్గయన్గాంచె మే
ఝురముల్ భగ్నజరత్కమండలునభస్స్వచ్ఛాంబు పూర్ణంబు
దరయంగానగుమేఖలల్ తెగవటుల్ త్యక్తంబుగావింపని [లిం
చ్చరతిందావినుటన్మకంబుచదువుక్ర్ శ్రావ్యంబుగా వేదముల్

కావున రమ్ము ప్రవేశించిచూతము. (ప్రవేశింతురు.)

జీ. వా.—(అంతటను జూచి) ఆహా! ప్రశాంతరమ్యంబైన యీయాశ్రమంబెంతయు మనోహరము గదా! ఒకవంక సంతసంబున మునికదంబము సందిగ్ధములగు వేదవాక్యముల యర్థములను బరిశీలించుచున్నారు. వేఱొకచోట వటువులు వేదంబులఁ బఠించుచు సమిధలను విఱుచుచున్నారు. మఱియొక చక్కని దాపసకన్యకలు చిన్నిమొక్కలకుఁ గుదుళ్ళునిండ నీరుపోయుచున్నారు. ఇక్కడ—

ఉ॥ స్వాగతమిచ్చుచుందుగను శ్రావ్యముగా నళినాదఝంకృతిన్
బాగుగ మ్రొక్కుఁ బుష్పఫల భారవినమ్ర శిరఃపరంపరన్
వేగమెయర్ఘ్యమిచ్చు సుమవృష్టినిజల్లుచు సంతసంబుగా
నేగతినేర్చెనో ! యతిథికిష్టులు పూజలుసేయవృక్షముల్.

కావున నీతపోవనంబు నివాసయోగ్యంబగును. ఇచట నివసించినచో మాకు సంతోషము గలుగునని తలంచెదను.

ఆత్రే:—ఏమిది ! ఈలేళ్ళు మెడలు కొంచెము ప్రక్కకుఁద్రిప్పి నములుచున్న దర్భలను సయితము క్రిందఁబడవైచి చెవులు నిక్కఁబొడిచి యానందపారవశ్యమునఁ గన్నులుమూసికొని యేదియో వినుచున్నట్లున్నవి.

జీ. వా.—(చెవియొగ్గి) మిత్రమా ! నీవు బాగుగనూహించితివి.

సీ॥ ఉరమును గంఠము శిరమునునని యెడి
స్థానసంప్రాప్తిచేఁ జతురముగను
బ్రకటితగమకమై పరఁగెడిమంద్రతా
రవ్యవస్థనుగాంచి రమ్యమైన
భ్రమరరుతంబుకైవడినొప్పు శ్రావ్యనా
దవిపంచితంత్రికా ధ్వనులతోడ
మిళితమై ప్రస్ఫుటలలితపదంబైన
గీతంబునీ కురంగీ గణంబు

గీ॥ కడకదంతాంతరాళస్థఘాసకబళ
చర్వణంబునుమాని నిశ్శబ్దముగను
జెవులు నిక్కించి కంఠముల్ చెలువుమీర
వెనుకకుమరల్చి యుత్కంఠ వినఁదొడంగె.

ఆత్రే :— వయస్యా! ఈ తపోవనంబున సంగీతము పాడెడు వారెవరు?

జీ. వా.— కోమలాంగుళులచే మీటఁబడి, తీఁగ లస్ఫుటముగ మ్రోగుచుండుటచేతను, సంగీతము కాకలీపధ్రాన మగుటచేతను, (వ్రేలితోఁ జూపుచు) నెవ్వరో దేవ కామిని యీ దేవాయతనంబున వీణె వాయించుచుఁ బాడుచు దేవు నారాధించుచున్నదని తలంచెదను.

ఆత్రే :— వయస్యా! ఇదిగో! దేవాలయము. విలోకింపుము.

జీ. వా.— చక్కగా వచించితివి. దేవతలకు నమస్కరించుట యవశ్య కర్తవ్యము. (సమీపించుచు, హఠాత్తుగ నిలచి) మిత్రుఁడా! ఇందలివారిని మనము చూడరాదేమో? కావున మనమీ తమాలవృక్షముచాటున నిలచి దేవతా దర్శన సమయమును నిరీక్షింతము. (చెట్టుచాటున దాఁగుదురు)

(మలయవతి నేలపైఁ గూరుచుండి వీణె వాయించుచుండును. ప్రక్క చేటి నిలఁబడును.)

మలయ :—(వీణె వాయించుచుఁ బాడును.)

గీ॥ కమలములలోని పుష్పొడికరణి గౌర
వర్ణముననొప్పు గౌరి! నావాంఛితంబు
సిద్ధినొందెడుఁగావుత శీఘ్రముగను
భగవతీ! నీ యనుగ్రహ భాగ్యమునను. 14

జీ. వా.— (చెవియొగ్గి) ఆహా! యేమిసంగీతము! ఏమి వాద్యము!



# నాగానందము

## ద్వితీయాంకము

(మనోహరికయను చేటి ప్రవేశించును)

మనో:— భర్తృదారికయగు మలయవతి "ఓసీ! మనోహరికా! నాసోదరుఁడైన యార్యమిత్రావసు వేగి చాల సేపైనది. కావున నీవరిగి వచ్చెనో! లేదో! తెలిసికొనిరమ్ము" అని యాజ్ఞాపించినది. (సమీపమునఁ జేరికఁజూచి) ఈ వచ్చెడివారెవ్వరై యుందురు! [గుర్తించి] నిజముగ నీమె చతురికయే.

(చతురిక ప్రవేశించును.)

మనో:— ఓసీ! చతురికా! యెందులకు నీవిట్లు తొందరగ వచ్చుచున్నావు?

చతు:— భర్తృదారికయగు మలయవతి "ఓసీ! చతురికా! పూవులు కోయుటచేత నలసిన నాశరీరమును శరత్కాలాతపమువలె సంతాపము మిక్కిలి బాధించుచున్నది. కావున నీవు శీఘ్రముగఁబోయి లేఁతయరఁటియాకులు పఱువఁబడిన చందనలతాగృహమందుఁ జంద్రకాంతమణిశిలాప్రదేశంబును

జీ. వా.—ఏమియును లేదు. అయినను మనలనుజూచి యీమె బాల్యసులభంబగు లజ్జచేతను, భయముచేతను నిక్కడఁ జాలసేపుండక వెడలిపోవునేమో! కావున నీ తీఁగెగుంపుల చాటుననుండి చూతము. (ఇద్దఱు చూచుచుందురు)

ఆత్రే:—(చూచి యాశ్చర్యముతో) మిత్రమా! చూడుము. చూడుము. ఈరమణీలలామ సంగీతముచేత శ్రోత్రానందముఁ గూర్చుటయేకాక, విజ్ఞానానురూపంబగు సౌందర్యముచేత నేత్రసుఖమును గలిగించుచున్నది. ఈలలన యెవ్వరు? దేవకాంతయా? లేక నాగకన్యకయా? కాక విద్యాధర దారికయా? మఱియు సిద్ధాంగనయా? చెప్పుము.

జీ. వా.—(ఆసక్తితోఁ జూచుచు) వయస్యా! ఈమె యెవ్వరో నిర్ణయింపఁజాలనుగాని, యొక్కయంశము మాత్రము నొక్కి చెప్పఁగలను.

సీ॥ స్వర్గసుందరియైన వాసవునేత్రి స
 హస్రంబు చరితార్థమగుఁదలంప
నాగకామినియైన నాగలోకంబీమె
 ముఖచంద్రుచేనిందు పూర్ణమెయగు
విద్యాధరియెయైన పివిధాన్యజాతి వి
 జయమునుగాంచు మాజాతినిజము.
సిద్ధరమణియైనఁ జెలువొందు నీమెచే
 సిద్ధాన్వయంబు ప్రసిద్ధికెక్కు
గీ॥ దివ్యభామినులకుఁ గాక దీప్తిమించు
 నిట్టిరూపంబు మర్త్యుల కెట్టులబ్బు?

మిలమిల మెఱుంగులీనెడు మెఱుపుఁ దీఁగె
భూమిలోనుండి యెందైనఁ బుట్టఁగలదె॥ 16

ఆత్రే:—(జీమూతవాహనుఁ జూచి సంతోషముతోఁ 'దశలో') అదృష్టవశమున నీతఁడు చిరకాలమునకు మన్మథుని కంటఁ బడినాఁడు (తన్ను నిర్దేశించుకొనుచు) మన్మథుని కంట ననవేల ? బ్రాహ్మణుండనగు నాకంటనే పడినాఁడు.

చతు:—(ప్రేమతో) భర్తృదారికా ! నిర్దయురాలగు నీమె యెదుట వాయించిన ఫలములేదని మనవి చేయుచున్నాను. (వీణెను లాగును)

మలయ:—ఓసీ ! భగవతియగు గౌరిని దూషింపకుము. ఇప్పుడాదేవి నాకు వరప్రసాదము గావించినది.

చతు:—(సంతోషముతో) భర్తృదారికా ! ఆ వరప్రసాదమెట్టిదో సెలవిమ్ము.

మలయ:—ఓసి ! వినుము. ఇట్లు మైమఱచి వీణెవాయించుచుండ నాభగవతి గౌరీదేవి నాకు స్వప్నమున సాక్షాత్కరించి "బిడ్డా ! నీగానమాధుర్యమునకును, బాల్య దుర్లభంబును నసాధారణంబునైన భక్తిపారవశ్యమునకును, మిక్కిలి సంతసించితిని. అచిరకాలముననె విద్యాధరచక్రవర్తి నీపాణిగ్రహణమహోత్సవమును నిర్వర్తింపఁ గలఁడు" అని యానతిచ్చినది.

చతు:— భర్తృదారికా ! నీవానతిచ్చినది నిజమేయైనచో స్వప్నం బననేల? నీహృదయేష్ట వరప్రసాదమే కావించినది.

ఆత్రే:—వయస్యా! దేవీదర్శనమున కిదియేసమయము. కావునఁ బ్రవేశింతము రమ్ము. (సమీపించి ముందుకు నడచు చున్నారు)

(జీమూతవాహనుఁ డంగీకరింపకున్నను బలవంతముగ లాగి)

అమ్మా! ఈమెమాట సత్యమే! దేవీవరప్రసాద మిదిగో.

మలయ:—(భయమున లేచుచు) ఓసీ! ఎవ్వరేవీరు?

చతు:—సౌందర్యాదులచేత నన్యోన్యాను రూపంబయిన యీ యాకృతిచేత దేవీ వరప్రసాద మిదియేయని యూహించు చున్నాను.

(మలయవతి యాసక్తితోడను సిగ్గుతోడను జీమూతవాహనునిఁ జూచుచు నిలుచుండును)

జీ. వా.—

గీ॥ చంచల విశాలలోచన! శ్వసిత కంపి
తఘనపీన పయోధర! తపము చేత
నలసియున్నది నీతనువధికముగను
సంభ్రమము నొందఁగానేల? సారసాక్షి! 17

మలయ:—(మెల్లగా) ఓసీ! భయాతిరేకంబువలన నీతని యెదుట నిలువఁజాలకున్నాను.

(సిగ్గుతో నోరగంట జీమూతవాహనునిఁ జూచుచుఁ గొంచెముమరలి నిలుచుండును)

ఆత్రే:—అమ్మా! ఆశ్రమంబునకువచ్చిన యతిథులను మాటల చేతనైనను సంమానింపకుండుట తపోవనాచార విరుద్ధము గాదా!

చతు:— (మలయవతినిఁజూచి తనలో) ఈమెదృష్టి వీనియం దనురక్త మగుచున్నట్లున్నది. కావున నిట్లు పలికెదను. (ప్రకాశముగ) భర్తృదారికా! ఈబ్రాహ్మణుఁడు చెప్పిన మాట నిజమే. అతిథులను సత్కరింపవలసియుండ నీ మహానుభావునియెడ నీవుపేక్ష వహించుచుంటివేల? పోనిమ్ము. నీవాగుము. నేనే యుచితరీతిని సత్కరించెదను. (జీమూతవాహనునిఁ గూర్చి) ఆర్యా! స్వాగతము. ఇటఁ గూరుచుండుఁడు.

ఆత్రే:— వయస్యా! ఈమె బాగుగఁ బల్కినది. ఇచ్చట క్షణము విశ్రమింతము.

జీ. వా.— అట్లే చేయుదము (ఇద్దరును గూరుచుందురు)

మలయ:—(సిగ్గుతో) అయ్యో! పరిహాసనశీలా! ఇదితగదు. ఎవ్వరేని తాపసు లిప్పుడు చూచినయెడల నన్నవినీతురాలుగఁ దలంతురుకదా!

(శాండిల్యుఁడను తాపసుఁడు ప్రవేశించును)

శాండి:— కులపతులగు కౌశికులవారు "వత్సా! శాండిల్య! యువరాజగు మిత్రావసువు విద్యాధరచక్రవర్తి యయ్యెడి కుమారజీమూతవాహనుండీ మలయపర్వతమున నెచ్చటనో యున్నాఁడని తెలిసికొని తన సోదరియగు మలయవతి నాతనికిచ్చి వివాహముచేయ నిశ్చయించి తండ్రి యాజ్ఞచే నిపుడే యక్కుమారుఁ జూడనేగెను. సోదరుని రాక కెదురు చూచుచుండుటచేత మలయవతియొక్క మాధ్యాహ్నికసవనవిధిసమయ మతిక్రమించునేమో! కావున

నామెను బిలుచుకొనిరమ్ము" అని యాజ్ఞాపించిరి. కాన నిప్పుడు గౌరీనిలయంబున కరిగెదను. (నడచుచు నేలను బరిశీలించి) ఆశ్చర్యము! ఈ ధూళియందుఁ జక్రవర్తి చిహ్నంబులు గలిగి స్పష్టముగఁగానుపించెడి యీపదపంక్తి యెవ్వరిదై యుండును? (ఎదుట జీమూతవాహను నిర్దేశించి) నిజముగ నీ యడుగులజాడ యిమ్మహాపురుషునిదే యయియుండును. అదియునుగాక—

మ॥ తలనుష్ణీషము నూర్ణకన్బొమల మధ్యంగానఁ గానయ్యెడిన్
జలజాతంబులఁబోలుకన్నులురమున్ స్పర్ధించుసింహంబుతో
నలిఁజక్రాంకితమీపదద్వయముకానన్ జూడనెవ్వాఁడో యీ
తఁడు విద్యాధరచక్రవర్తిపదవిన్ దథ్యంబుగానొందెడిన్ ॥18

ఇంకను సందేహమేల? ఈతఁడు నిక్కముగ జీమూతవాహనుఁడే. (మలయవతిని జూచి) మలయవతియు నిక్కడనే యున్నదే! (ఇద్దఱనుజూచి) అనురూపసౌందర్యవంతులగు వీరిద్దఱకును వివాహసంబంధము సంఘటించిన యెడల నిప్పటికైనను విధాత యనురూపసంధాత యనిపించుకొనును. (సమీపించి జీమూతవాహనునితో) స్వస్తి భవతే.

జీ. వా.— (లేచి) భగవన్! జీమూతవాహనోఽహమభివాదయే. (ఆసనం బీయఁబోవును)

శాండి:—వలదు. వలదు. "సర్వస్యాభ్యాగతోగురు" వనెడి యార్యోక్తి వలన మాకెల్లరకును నీవేపూజ్యుఁడవు కావున సుఖాసీనుఁడ వగుము.

మలయ:—ఆర్యా ! నమస్కారము.

శాండి:—భద్రే! అనురూప భర్తృభాగినీ భూయాః—
రాజపుత్త్రి ? "మధ్యందినసవనవేళ యతిక్రమించు చున్నది కావున శీఘ్రముగ రమ్ము" అని కులపతులవారు నీకు కబురంపినారు.

మలయ:—గురువులవారి యాజ్ఞచొప్పున నిదేవచ్చుచున్నాను.
(లేచి నిట్టూర్పువిడచి లజ్జానురాగములు పెనఁగొన చేటితోడ మలయవతి నిష్క్రమించును.)

జీ. వా.—(సోత్కంఠముగ నిశ్వసించి వెళ్లుచున్న మలయవతిని జూచుచు)

గీ॥ ఘన జఘనభారమున మందగతిని దన ని
వాసభూమికి నేగు నీవనితచేత
భృంగిచేతనుబలె నాదు హృదయపద్మ
మందుఁ బదముంచఁబడియె నత్యద్భుతముగ. 19

ఆత్రే:—చూడఁదగినదానిఁ జూచితిమి. ఇప్పుడు మధ్యాహ్నార్క సంతాపమువలన ద్విగుణితమైనట్లు నా జఠరాగ్ని భగభగ మండుచున్నది. కావునఁ బోవుదము రమ్ము. మునిజనులవలనఁ గందమూల ఫలంబులనైన నాతిథ్యము వడసి ప్రాణములు రక్షించుకొనవచ్చును.

జీ. వా.—(పైకిఁజూచి) ఏమీ! సూర్యభగవానుఁ డంబర మధ్యభాగ మలంకరించియున్నాఁడే !

సీ॥ తాపాధికతఁజేసి తక్షణఘృష్టచం
దనరసమున నతిధవళమైన

గండస్థలంబులఁ గడఁకమై వహియించి
కీలిత నిజకర్ణతాళపవన
ముల వీజితంబయిలలిహస్త సంప్రోక్షి
తములైన శీకరసముదయముల
నత్యంత సిక్తావయవముల నెంతయు
దీపించుచును జాల దిటముగాను

గీ॥ విరహతాపభరంబున వెతలనందు
కాముకులదశ యెంతయుఁ గాంచునహహ !
పట్టపగలింటిభానుచే బాధితమయి
యూథపతియగు ద్విరదమత్యుల్బణముగ. 20

(అందఱును నిష్క్రమింతురు)

ప్రథమాంకము సంపూర్ణము





# నాగానందము



## ద్వితీయాంకము



(మనోహారికయను చేటి ప్రవేశించును)

మనో :— భర్తృదారికయగు మలయవతి "ఓసీ! మనోహారికా! నాసోదరుఁడైన యార్యమిత్రావసు వేగి చాల సేపైనది. కావున నీవరిగి వచ్చెనో? లేదో? తెలిసికొనిరమ్ము" అని యాజ్ఞాపించినది. (నడచుచుఁ దెరవంకచూచి) ఈ వచ్చెడివారెవరై యుందురు? [గుర్తించి] నిజముగ నీమె చతురికయే.

(చతురిక ప్రవేశించును.)

మనో :— ఓసీ! చతురికా! యెందులకు నీవిట్లు తొందరగ వచ్చుచున్నావు?

చతు :— భర్తృదారికయగు మలయవతి "ఓసీ! చతురికా! పూవులు కోయుటచేత నలసిన నాశరీరమును శరత్కాలాతపమువలె సంతాపము మిక్కిలి బాధించుచున్నది. కావున నీవు శీఘ్రముగఁబోయి లేఁతయరఁటియాకులు పఱువఁబడిన చందనలతాగృహమందుఁ జంద్రకాంతమణిశిలాప్రదేశంబును

సిద్ధముచేయుము" అని యాజ్ఞాపించెను. నేను నామె యానతిచ్చిన విధంబున సిద్ధపఱిచితిని. ఇపుడే యేగి యామెకీసంగతి విన్నవించెదను.

మనో:—అట్లయినచో శీఘ్రముగఁబోయి తెలుపుము. చందనలతాగృహంబున కరిగిన నామెసంతాపముపశమించునేమో?

చతు:—[నవ్వి తనలో] మలయవతి సంతాపమిట్టివానివలన నుపశమింపకపోవుటయేగాక మనుష్యరహితంబును, మనోహరంబునగు చందనలతాగృహంబును జూచుటచేత మఱింత హెచ్చునని యూహించుచున్నాను. [ప్రకాశముగ] ఇఁక నీవు త్వరితముగఁ బొమ్ము. నేనును జంద్రకాంతశిలాతలము సిద్ధపఱిచితినని మలయవతికిఁ దెలిపెదను.

(ఇద్దఱును నిష్క్రమింతురు.)

(ఇది ప్రవేశకము)



(సోత్కంఠయగు మలయవతి చేటితోఁ బ్రవేశించును)

మలయ:—(నిట్టూర్పువిడచి తనలో) హృదయమా! అప్పుడా విధముగ నాజనునియందు నన్నుఁబరాఙ్ముఖురాలుగ నొనరించి యిపుడు స్వయముగనే యాతని ననుసరించిన నీస్వార్థపరాయణత్వ మెంతయు నాశ్చర్యముఁ గలిగించుచున్నది. (ప్రకాశముగ) ఓసీ! చతురికా! గౌరీగృహమార్గమును జూపుము.

చతు:— అమ్మా! మీరిపుడు చందనలతాగృహమునకుఁ గదా బయలుదేఱినారు? గౌరీగృహమార్గమును జూపుమనుచున్నారేమి?

మలయ :— [సిగ్గుపడి] బాగుగ జ్ఞప్తికి దెచ్చితివి. అచటికే పోవుదము పద.

చతు :- భర్తృదారికా ! యిటురమ్మా. [ముందుకు నడచును]

(మలయవతి మతియొకవైపునకుఁ బోవును.)

చతు :— [వెనుదిరిగి మలయవతినిఁ జూచి యుద్వేగమునఁ దనలో] ఈమె మరల గౌరీగృహమార్గము వెంటనే పోవుచున్నదే ! [ప్రకాశముగ] అమ్మా ! భర్తృదారికా ! అటు కాదు. ఇటురమ్మా. చందనలతాగృహమిక్కడనున్నది.

(మలయవతి తెల్లఁబోయి సిగ్గునమరలి చందనలతాగృహ మార్గమున నడచును)

చతు :— భర్తృదారికా ! ఇదిగో ! చందనలతాగృహము. ఇందుఁ బ్రవేసించి యీచంద్రమణి శిలాతలంబునఁ గూరుచుందము. (ఇరువురును బ్రవేశింతురు)

మలయ :— (నిట్టూర్పువిడచి తనలో) భగవానుఁడా ! కుసుమాయుధా ! ఎవ్వఁడు నిన్ను సౌందర్యమున జయించెనో ! వాని నేమియుఁ జేయఁజాలక యబలననికాఁబోలు నిరపరాధనగు నన్నుఁ బ్రహరించుచున్నావు. నీకు సిగ్గేలేదో కదా ! (తన్ను నిర్దేశించుకొని మనధ్యావస్థను నటించుచు) ఓసీ ! దట్టమగు చిగురుటాకులచేత సూర్యకిరణములను సైతము నిరోధించి, మిక్కలి చల్లనై యతి మనోహరంబగు నీ చందనలతాగృహ మిపుడు నా సంతాపదుఃఖముఁ బోఁగొట్టఁజాలకున్నదేమే ?

చతు :— (చిఱునగవుతో) దీనికిఁ గారణము నేనెఱుంగుదును. అయిన నది యసంభావ్యమని నీవు త్రోసిపుత్తువు..

మలయ :—(తనలో) ఓహో! ఈమె నాతీరు కనిపెట్టినది. కానిమ్ము. అడిగిచూచెదను. (ప్రకాశముగా) ఓసీ! నీకది యెందులకు? ఆకారణ మేదియో చెప్పుము.

చతు :— ఇదె, దేవీదత్త హృదయేష్టవర...(అర్ధోక్తియందే)

మలయ :—(సంతోషముతో తొందరగ లేచి రెండు మూఁడడుగులు నడచి) ఎక్కడెక్కడ?

చతు :— (లేచి, చిఱునగవుతో) భర్తృదారికా! ఏమది? అట్లు సంభ్రమించెదవేల? (మలయవతి సిగ్గునఁ దలవంచి కూరుచుండును.)

చతు :—భర్తృదారికా! ఇదె దేవీదత్తహృదయేష్ట వరప్రసాదంబని స్వప్నవృత్తాంతమును నీవు వర్ణించుచుండఁ బుష్పచాపంబు విడచివచ్చిన మన్మథునివలె మనోహరుఁడగు నే యువకుఁడు నీకు సాక్షాత్కరించెనో, యాతఁడే నీసంతాపంబునకుఁ గారణమని చెప్పఁదలఁచితిని. ఆకారణముననే స్వభావ శీతలమయినను జందనలతాగృహ మిపుడు నీ సంతాపదుఃఖము నపనయింపఁజాలదయ్యె.

మలయ :—(చతురికముంగురులు సవరించుచు) ఓసీ! నీవు చతురికవుగదా! నీకుఁజెప్పకదాఁపనేల? చెప్పెదవినుము.

చతు.—భర్తృదారికా! ఇంకఁజెప్పవలసినదేమున్నది? ఇప్పుడు వరపరిసంగమునువిని నీవుపడిన సంభ్రమము వలననే వ్యక్తమయినది. ఇఁకనీవు సంతాపపడకుము. ఆతఁడునునిన్నుఁ జూడక క్షణమైనను నిలువఁజాలఁడని నేనూహించితిని. ఈమాట యసత్యమైన నేను మాఱుపేరు పెట్టుకొందును.

మలయ :—(కన్నీటితో) ఓసీ ! అంతటియదృష్టమా !

చతు :—అమ్మా ! అట్లనకుము. మధుమథనుండగు విష్ణుమూర్తి సయితము వక్షస్స్థలమున లక్ష్మీదేవిని బెట్టుకొనక క్షణమైన నిలువఁజాలఁడు. ఇఁకసామాన్యులమాటచెప్పనేల?

మలయ :— ప్రియజనులు ప్రియమునుగాక మరియొకటి చెప్పుదురా? చెలియా ! వెనుక నేనాతనితో మాటయైన నాడకపోయితిని. అందుచే నన్నుఁగూర్చి యేమితలంచునో? యని మిక్కిలి కలఁతపడుచుంటిని. [ఏడ్చును]

చతు :—[కన్నీరుతుడుచుచు] భర్తృదారికా ! దుఃఖింపకుము. [లేచి చందనపల్లవమును పిండి వక్షంబుననుంచును]అయ్యో ! ఇంకనుదుఃఖించెదవేల ? సంతతధారగఁబడుచున్న కన్నీటిచేత వెచ్చనై యీచందనరసము నీసంతాపము నపనయింపఁ జాలకున్నది. [అనఁటియాకుచే విసరును].

మలయ :— [చేతితోనివారించుచు] సఖియా ! విసరకుము. ఈకదళీదళమారుతము మిక్కిలివెచ్చగనున్నది.

చతు :—భర్తృదారికా ! ఈకదళీదళవాయువునందు దోషమారోపింపకుము. చందనలతాపల్లవసంసర్గముచేత శీతలంబైన యీకదళీదళమారుతమును, నిట్టూర్పులచే నీవే వెచ్చగనొనరించుచున్నావు.

మలయ :— చెలియా ! ఈదుఃఖముపశమించుట కేదైన నుపాయముగలదా ?

చతు :— లేకేమి ? ఆతఁడువచ్చినచో నుపశమించును.

(జీమూతవాహనుఁడును, ఆత్రేయుఁడును ప్రవేశింతురు)

జీ. వా.— గీ॥ మరలిచూచెను గాంతనన్ మానిమోల
చూపుచేతనె హతుఁడను జుమ్ముపుష్ప
బాణుఁడా ! వ్యర్థముగనాదు పైననేల
శరములను వేయఁదొడఁగితి? సరభసముగ. 1

ఆత్రే :— వయస్యా ! నీధైర్యమంతయు నేమైనదోయి ?

జీ. వా.— మిత్రమా ! ధరతకేమికోపము ! చూడుము.

సీ॥ శుక్లపక్షపుపా శుభ్రచంద్రాతప
కలితరాత్రులను నే గడుపలేదె ?
పరిమళభరితమై సరిఘవిల్లెడు నట్టి
నల్లకల్వల మూర్కొనంగలేదె ?
మాలతీ సుమగంధమహితమై నెగడెడి
చల్లనిగాడ్పుల నోల్లలేదె ?
కమలాకరంబులఁ గల మధుపంబుల
ధ్వనులను సతతమ్ము వినఁగలేదె ?

గీ॥ ఇంకనిట్టివి పెక్కు సహించియుండ
విరహవంతులలోపల వృథగనన్న
ధైర్యశాలియటంచును దప్పఁబల్కి
యేల నిష్కారణంబుగ జేలనైతి ? 2

అయినను నే వచించినది బాగుగలేదు. ఏలయన—

గీ॥ స్త్రీగతంబగు హృదయంబుచేననంగ
ప్రేరితసుమేషువులును సహింపనైతి
ధీరుఁడనటంచు నీమ్రోలఁదెల్పుచుంటి
నిప్పుడిదియెట్లుపొసఁగెడి నెంచిచూడ? 3

ఆత్రే :—(తనలో) ఈతడు దుస్సహమగు హృదయావేగము నొందుచున్నాఁడని యీతని యధైర్యముచేతనే విశదమగు చున్నది. కావుననిట్లుపలికెదను. (ప్రకాశముగా) వయస్యా! ఈనాఁడు గురుశుశ్రూష త్వరగనే ముగించి వచ్చితివేల?

జీ. వా.—మిత్రమా! ఈప్రశ్నము చక్కఁగ నున్నది. నీకుఁ గాక యింకనెవ్వరికిఁ జెప్పుదును? వినుము. ఇపుడు నేనొక కలఁగాంచితిని. అందు ఆ నాప్రియురాలు (వ్రేలితోఁ జూపుచు) ఈ చందనలతాగృహంబునఁ జంద్రకాంతమణి శిలాతలంబునఁ గూరుచుండి, ప్రణయకుపితయై నన్నుఁ గూర్చి యేవియో యుపాలంభనవాక్యములు పలుకుచు దుఃఖించుచున్నట్లు గానుపించెను. కావున స్వప్నానుభూత మగు దయితాసమాగమముచే రమ్యమైన యీప్రదేశ ముననే పవలెల్లఁ గడపఁదలఁచినాఁడను. పోవుదము రమ్ము.

(ఇరువురు నడతురు)

చతు :—[చెవియొగ్గి సంభ్రమమున] భర్తృదారికా! అడుగుల సవ్వడివలె వినఁబడుచున్నది.

మలయ:— [సంభ్రమముతోఁ దనశరీరము విలోకించికొని] చతురికా! ఇప్పటి నాశరీర స్థితినిజూచి యెవ్వరైన రహస్య మును గనుగొందురేమో! కావున నీరక్తాశోక వృక్షము చాటున దాఁగి వారెవ్వరో చూతము. [ఇరువురును జెట్టు చాటున దాఁగుదురు]

ఆత్రే :—వయస్యా! ఇదిగో! చందనలతాగృహము. లోపలికిఁ బోవుదమురమ్ము. (ప్రవేశింతురు)

జీ. వా.— గీ॥ చందనలతాగృహంబిది చంద్రకాంత
మణులచే రమ్యమయ్యును మామకీన
హృదయమున కింపుగాద ; యా ముదితలేమి
ముక్తకౌముదియౌ నిశాముఖమునట్లు. 4

చతు :— [జీమూతవాహనునిఁ జూచి] భర్తృదారికా ! నీ వదృష్టవంతురాలవు. వీఁడుగో ! నీ హృదయవల్లభుఁడు.

మలయ :—[చూచి భయసంతోషములతో] ఓసీ! యీతనిఁ జూచుచు సమీపమున నుండఁజాలను. ఈతఁడునన్నుఁ జూచునేమో? దూరముగఁ బోవుదము రమ్మ. [తొందరగ రెండడుగులు వేయును]

చతు :— [నవ్వి] పిఱికిదానవువలె నున్నావు. ఇక్కడనున్న నిన్నెవ్వరు చూతురు ? రక్తాశోకవృక్షముచాటున నున్న మాట మఱచితివాయేమి ? భయములేదు. ఇక్కడనే యుండవచ్చును. [అక్కడనే యుందురు.]

ఆత్రే :— [వ్రేలితోఁ జూపుచు] మిత్రమా ! నీకు స్వప్నమందుఁ గానుపించిన చంద్రకాంతశిల యిదిగో !

(జీమూతవాహనుఁడు కన్నీరునించుచు నిట్టూర్పువిడచును)

చతు :— భర్తృదారికా ! 'స్వప్నమందుఁజూచిన దిదిగో !' అనుమాట వినఁబడుచున్నది. అదియేదియై యుండునో ? సావధానముగ వినవలయును. [ఇద్దఱును వినుచుందురు]

ఆత్రే :— [చేతితో జీమూతవాహనునిఁ గదలించుచు] వయస్యా ! నీవుకలఁగాంచిన చంద్రమణిశిల యిదియేయని చెప్పుచున్నాను. వినవేమి ?

జీ. వా.—మిత్రమా! చక్కఁగఁ గనిపెట్టితివి. [చేతితోఁజూపుచు]

ఉ॥ వామకరంబునందుఁ బరిపాండుముఖంబువహించియూర్చుచు
న్భామిని భ్రూవికారముల వ్యక్తముచేయుచు నింగితంబుఁదా
నే మఱియాలసింపఁగను హృద్గతమున్వ్యపడంచి యేడ్చునా
కామిని నెందుఁజూచితినొ ? కాంతవిధూపలవేదియయ్యెదే! 5

కావున నీచంద్రకాంతమణిశిలయందే కూరుచుందము.

మలయ:— [ఆలోచించి] ఈమె యెవరై యుండును ?

చతు:— భర్తృదారికా ! మనము చాటునదాఁగి యీతనిఁ జూచుచున్న ట్లీతఁడును నిన్నుఁ జూచియుండవచ్చును.

మలయ :— కావచ్చును. కాని ప్రణయకుపితాప్రసంగము పొసఁగు టెట్లు ?

చతు:— ముందుగనే యిట్టులు శంకింపకుము. సాకల్యముగ విందము.

ఆత్రే:— [తనలో] ఈతఁడీ కథవలన వినోదించుచున్నాఁడు. కాన దీనినే వర్ధిల్లఁ జేసెదఁగాక. [ప్రకాశముగ] అటులు దుఃఖించుచున్న యామెతో నీవేమంటివి ?

జీ. వా.— మిత్రమా ! వినుము.

గీ॥ చెలియ ! భవదీయ బాష్పాంబు సిక్తమయిన
చంద్రకాంత శిలాస్థలి సరగ తావ
కీనముఖచంద్రు నుదయముచే నెపుడును
తోఁచె ద్రవియించునదివోలెఁ దోయజాక్షి ! 6

అనియంటిని.

మలయ :— [కోపముతో] చతురికా! వింటివా? ఇంకను వినఁదగినదేమున్నది? [కన్నీరునించుచు] రమ్ము పోవుదము.

చతు :— [చేయిపట్టుకొని] భర్తృదారికా! వలదు. నిన్నుఁ జూచినయాతఁడు వేఱొక కాంతనుగూర్చి యిట్లు పలుకునని నేను నమ్మను. కావునఁ గథ పూర్తియగువఱకు నిరీక్షింతము.

జీ. వా.— మిత్రమా! ఆమెనే యీశిలాతలంబున వ్రాసి చిత్రగతయగు నాభామినితో వినోదించెదను. కావున సమీపముననున్న గిరితటమునుండి మణిశిలాఖండములను దీసికొనిరమ్ము.

ఆత్రే :—చిత్తము. [ వెళ్లి మరలివచ్చి] ఓ వయస్యా! నీవొక్క వర్ణమునుమాత్రమే తెమ్మనిచెప్పితివి. నే నీపర్వతము నుండి యయిదురంగులు తెచ్చితిని. కావునఁ జిత్తరువు వ్రాయుము. [ఇచ్చును]

జీ. వా.— వయస్యా! మంచిపని చేసినాఁడవు. [తీసికొని ఱాతియందుఁ జిత్తరువును వ్రాయుచు రోమాంచముతో] మిత్రమా! చూడుము. చూడుము.

గీ॥ పరగ నక్లిష్టబింబ శోభాధరంబు
నయనముల కుత్సవంబైన నాతివదన
రేఖయును బ్రథమంబున దృష్టమగుట
సౌఖ్యమొదవించె నూతన చంద్రునట్లు. 7

ఆత్రే :— (కౌతుకముతోఁజూచి) వయస్యా! కన్నులకుఁ

గానుపింపని వస్తువునుసయితమిట్లు మనోహరంబుగఁ జిత్రించుట యాశ్చర్యముగనున్నది.

జీ. వా.— వయస్యా !

గీ॥ హృదయసంకల్పములచేత నెదుటనున్న
సుందరి లిఖించుచున్నాఁడఁ జూచిచూచి
సర్వజనసులభంబగు సరణియగుట
నిందు నాశ్చర్యమెయ్యది ? యెంచిచూడ. 8

మలయ :—(నిట్టూర్పువిడచి కన్నీరునించుచు) చతురికా! కథ ముగిసినది. ఇఁక రమ్ము. ఆర్యమిత్రావసువును జూతము.

చతు :— [విషాదమునఁ దనలో] ఓహో ! యీమెమాటల తీరుచూడ జీవితమందాశలేనట్లు పొడకట్టుచున్నదే! [ప్రకాశముగా] భర్తృదారికా ! ఆయనకొఱకు మనోహారిక వెళ్ళినదికదా ! ఒకవేళ భర్తృదారకుఁడగు మిత్రావసు విక్కడకు రావచ్చును.

(మిత్రావసువు ప్రవేశించును)

మిత్రా :— మాతండ్రిగారు “వత్స ! మిత్రావసూ ! సమీపనివాసంబువలనఁ గుమారజీమూతవాహనుని స్వభావము చక్కఁగఁ బరీక్షించితిమి. ఈతఁడు తగినవరుఁడు. కావున మలయవతి నీతనికిచ్చి వివాహమొనరింప నగును” అని యాజ్ఞాపించిరి. నేనుమాత్రము స్నేహపరాధీనుఁడనగుటచేత నేదియోయొక యవస్థాంతరము ననుభవించుచున్నాఁడను.

సీ॥ ప్రకట విద్యాధరరాజాన్వవాయ సు
తిలకుఁడు ప్రాజ్ఞుఁడు ధీరబుద్ధి

సజ్జనౌఘములకు సమ్మతుండును రూప
సంపదనెందును సాటిలేని
వాఁడు పరాక్రమవంతుఁడు పండితుం
డొగి వినీతుండును యువకుఁడు దయఁ
బ్రాణులరక్షింపఁ బ్రాణంబులును విడ
నాడెడు సాహసికాగ్రియాయి
గీ॥ వైన యీతని కిపుడు నాయనుజనిచ్చు
టెంతయును తుష్టికారణం బెంచిచూడ
సాహసంబును దలపోయ సరభసమున
నుద్భవించువిషాద మత్యుత్కటముగ. 9

మఱియు జీమూతవాహనుం డిచ్చటనే గౌర్యాశ్రమమునొద్దఁ జందనలతాగృహంబున నున్నాఁడని వింటిని. కావున నిదిగో చందనలతాగృహము. ప్రవేశించెదను. (ప్రవేశించును)

ఆత్రే :— (సంభ్రమముతో విలోకించి) వయస్యా! వీఁడుగో! సిద్ధయువరాజగు మిత్రావసు విటకే వచ్చుచున్నాఁడు. ఆతఁడు చూచునేమో? కావున నీ కదళీపత్రముచేత నీ చిత్తరువును గప్పివేయుము.

(జీమూతవాహనుఁ డరఁటియాకుచేఁ జిత్తరువును గప్పివేయును.)

మిత్రా :— (సమీపించి) కుమారా! మిత్రావసునమస్కారమును గ్రహింపుము.

జీ. వా.— (చూచి) మిత్రావసూ! స్వాగతము. ఇటఁ గూరుచుండుము.

చతు :— భర్తృదారికా! మిత్రావసువు వచ్చినాఁడు.

మలయ :— సంతోషము.

జీ. వా.—మిత్రావసూ! సిద్ధరాజగు విశ్వావసువునకుఁ గుశలమా?

మిత్రా :— మాతండ్రిగారు కుశలముగనున్నారు. పూజ్యులగు వారి యాజ్ఞచేతనే, నీసన్నిధికి వచ్చియుంటిని.

జీ. వా.— పూజ్యపాదు లేమిసెలవిచ్చినారు ?

మలయ :— తండ్రిగారు పంపిన సందేశమేదియో వినవలయును.

మిత్రా :— మాతండ్రిగారు “ సిద్ధరాజవంశమునకెల్ల జీవిత ప్రాయయగు మలయవతియను కూఁతురుగలదు. ఆమెను నీకిచ్చి వివాహముచేయఁదలంచితిమి. కావున నంగీకరింప వలయు ”నని నీకు సందేశమంపిరి.

చతు :—(నవ్వి) భర్తృదారికా ! ఇంతకుఁబూర్వము చేసిన వర పరిసంగమునకుఁ గోపించితివిగదా! ఇప్పుడును గోపించెదవా?

మలయ :— (కోరికతోడను సిగ్గుతోడను దలవంచి) ఓసీ ! యింతమాత్రమునకే సంతోషింపకుము. ఈతని యన్యా సక్తిని మఱచితివాయేమి ?

జీ. వా.— (ఆత్రేయునితో) వయస్యా ! యిపుడుక్లిష్టపరిస్థితియే తటస్థించినది.

ఆత్రే :— [జీమూతవాహనునితో] మిత్రమా ! నీహృదయ మా కాంతాలలామయందుఁగాక యన్యకామినులయం దనురక్తము కాదని నేనెఱుంగుదును. అయిన నేదియో సమాధానముచెప్పి యీతనిఁ బంపివేయుము.

మలయ :— [రోషమునఁ దనలో] ఓరీ! దుష్టుఁడా! యీ టక్కరితన మెవరికిఁ దెలియదు?

జీ. వా.— మిత్రావసూ! శ్లాఘ్యమగు మీసంబంధ మెల్లరకు నభిమతంబ. అయినను వేఱొకయెడ ననురక్తమయిన యీనాచిత్తమును మరలించుకొనఁజాలను.

(మలయవతి మూర్ఛిల్లును)

చతు :— భర్తృదారికా! ఊరడిల్లుము. ఊరడిల్లుము.

ఆత్రే :— (మిత్రావసువుతో) అయ్యా! యీతఁడు పరాధీనుఁడుకదా! వీనితోఁ బ్రసంగించిన నుపయోగములేదు. కావున నీతని తలిదండ్రులను బ్రార్థింపుము.

మిత్రా :— (తనలో) ఈతఁడు బాగుగఁ జెప్పినాఁడు. జీమూతవాహనుఁడు తలిదండ్రులయాజ్ఞ నతిక్రమింపఁడు. ఈతని తలిదండ్రులును నీ గౌర్యాశ్రమముననే నివసించుచున్నారు. కావున నిప్పుడే యరిగి మలయవతిని బరిగ్రహించుట కీతని తలిదండ్రుల నంగీకరింపఁజేసెదను.

(మలయవతి యూరడిల్లును)

మిత్రా :— (జీమూతవాహనునితో) కన్యనీయవచ్చిన మమ్మిట్లు నిరాకరించుట తగునో! తగదో! నీకే తెలియును.

మలయ :— (రోషముతో) ఈవిధమున నతి లాఘవముగ నిరాకరింపఁబడియు మిత్రావసువు మరల మాటలాడు చున్నాఁడే!

(మిత్రావసువు నిష్క్రమించును)

మలయ:—(కన్నీటితోఁ దనశరీరముఁ జూచుకొనుచు) దౌర్భాగ్య కళంకమలినంబును, దుఃఖభాగియు నగు నీపాడుశరీరము వలన నేమిప్రయోజనము కలదు? కావున నిచటనే రక్తాశోకవృక్షమున నీయతిముక్త లతతో నురిపోసికొని మరణించెదను. (ప్రకాశముగ విలక్షస్మితముతో) ఓసీ! చతురికా! మిత్రావసువు దూరముగనేగెనో? లేదో? చూడుము. నేను నిటనుండి వెళ్లెదను.

చతు:— చిత్తము. (కొన్నియడుగులు నడచి) ఈమె చిత్తవృత్తి వేఱొకవిధముగనున్నట్లు పొడకట్టుచున్నది. కావున నిటనే దాఁగియుండి యీమె యేమిచేయునో చూచెదను.

మలయ:— (లేచి దిక్కులుపరికించి యురిత్రాడు పట్టుకొని కన్నీటితో) భగవతి! గౌరి! ఈజన్మమున నీవు నాకు వర ప్రసాదంబొనరించి యీదుఃఖ మపనయింపకున్నను జన్మాంతరముననైన నిట్టిదుఃఖము నాకుఁ గలుగకుండునటు లనుగ్రహింపుము. (కంఠమున కురిత్రాడు తగిలించును)

చతు:— (చూచి సంభ్రమముతో) రక్షింపుఁడు. రక్షింపుఁడు. ఈ మా భర్తృదారిక యురిపోసికొని యాత్మహత్య గావించుకొనుచున్నది.

జీ. వా.— (తొందరగసమీపించి) ఎక్కడెక్కడ?

చతు:— ఇదిగో! ఈ యశోకవృక్షముక్రింద.

జీ. వా.—(చూచి సంతోషముతో) ఏ కాంతాలలామయందు నామనం బాసక్తమయ్యెనో, యీ రమణీమణియేకదా! యీమె. (మలయవతి చేయిపట్టుకొని యురిత్రాడుతీసివేసి)

గీ॥ వలదు వలదిట్టి సాహసమలరుఁబోఁడి !
కరములోనిలతన్విడు కలికిమిన్న !
సుమములను గోయఁజాలని సుదతి ! నీదు
కరముపాశము బంధింపఁగలదె ? చెపుమ. 10

మలయ :— [భయముతో] అయ్యో ! ఎవఁడీతఁడు ? (జీమూతవాహనుని గుర్తించి రోషమునఁ జేయివిడిపించుకొన యత్నించును) నాచేయి విడువుము. నివారించుటకు నీవెవఁడవు ? మరణమునకై నను నిన్నె ప్రార్థింపవలయునా ?

జీ. వా.— నేను విడువను.

గీ॥ హారలతలు ధరించుటకర్హమైన
నీదుగళమునఁ బాశమునేదిచుట్టె ;
నట్టి యపరాధియైన నీహస్తపల్ల
వంబు చిక్కెను విడువఁగ వలనుపడదు. 11

ఆత్రే :— (చతురికతో) అమ్మాయీ ! మీభర్తృదారిక యురిపోసికొనుటకుఁ గారణమేమి ?

చతు :— (సాభిప్రాయముగ) నీప్రియవయస్యుఁడే కారణము.

జీ. వా.— (పశ్చాత్తాపముతో) ఈమె మరణప్రయత్నమునకు నేనుగారణ మెటులగుదునో ! తెలియఁజాలకున్నాఁడను.

ఆత్రే :— అమ్మాయీ ! చెప్పుము.

చతు :— మీ ప్రియ వయస్యుఁడు హృదయవల్లభయగు నొకానొకతెను జిత్రించి యామెయందలి పక్షపాతముచేత మిత్రావసు ప్రార్థనంబును దిరస్కరించెను. అది విని యామె నిర్విణ్ణయై యాత్మహత్య గావించుకొనుచున్నది.

జీ. వా.— (సంతోషమునఁ దనలో) ఓహో! మిత్రావసుసోదరీ మణియగు మలయవతి యీమెయేనా ? ఇందు సందియ మునకుఁ బనిలేదు. రత్నాకరంబునఁగాక వేఱొకయెడఁ జంద్రరేఖ యుదయింపదు కదా! కష్టము. సంపూర్ణముగ వంచింపఁబడితిని.

ఆత్రే :— అమ్మాయీ! ఇది నిక్కమేయయినచో, నిప్పుడు మామిత్రుఁ డపరాధికానేరఁడు. నామాటలు నమ్మవేని నీవు వెళ్లి స్వయముగా నాశిలాతలంబును జూడుము.

మలయ :— (సంతోషముతోడను, సిగ్గుతోడను జీమూత వాహనుఁ జూచుచు హస్తము విడిపించుకొన నెంచును) విడువుము. విడువుము. నాచేయి విడువుము.

జీ. వా.— (చిఱునగవుతో) ఈశిలాతలంబున నేనువ్రాసిన హృదయ వల్లభను నీవుచూచినఁగాని విడువను.

(అందఱును నడతురు)

ఆత్రే :—(అరఁటియాకునుదొలఁగించి) అమ్మాయీ! ఇదిగో! మావయస్యుని హృదయవల్లభ.

మలయ :— (గుర్తించి, చతురికతోఁ జిఱునగవున) చతురికా! నాప్రతిమవలె నున్నదే!

చతు :— [చిత్రాకృతిని మలయవతిని బోల్చిచూచి] భర్తృ దారికా! నీకును నీశిలయందు వ్రాయఁబడిన కాంతకును నాకారసామ్యము సరిగనున్నది. ఈచంద్రకాంతశిలయందు నీవు వ్రాయఁబడితివో! నీప్రతిబింబము సంక్రాంతమైనదో! తెలిసికొనఁజాలకున్నాను.

మలయ :— (సవ్రీడ) ఈచిత్తరువుఁ జూపుచున్న యీతనిచేత నేను దుర్జనురాలుగ నొనరింపఁబడితినిగదా !

ఆత్రే :— మిత్రమా ! ఇపుడు గాంధర్వవివాహము జరిగినది. కావున నీమెహస్తమును విడువుము. ఎవ్వతెయో ; యిటు త్వరితముగ వచ్చుచున్నది.

(జీమూతవాహనుఁడు మలయవతి హస్తమునువిడచును. చేటి ప్రవేశించును)

చేటి :— (సంతోషముతో శీఘ్రముగసమీపించి) అమ్మా ! భర్తృదారికా ! జీమూతవాహనుని తలిదండ్రులు నిన్నుఁ గుమారునికి వివాహమొనరించుకొనుట కంగీకరించినారఁట.

ఆత్రే :— (గంతులువేయుచు) ప్రియవయస్యుని మనోరథము సంపూర్ణమయినది. ప్రియవయస్యునిదికాదు. మలయవతి మనోరథము. వీరిద్దఱిదినిగాదు. (భోజనమభినయించుచు) బ్రాహ్మణుఁడనగు నామనోరథమే సంపూర్ణమయ్యెను.

చేటి :— (మలయవతినుద్దేశించి) యువరాజగు మిత్రావసువు “ఇప్పుడే మలయవతీవివాహము జరుగును. కావున నామెనుదీసికొని శీఘ్రముగరమ్ము” అని నన్నాజ్ఞాపించెను. కావున రమ్ము పోవుదము.

ఆత్రే :— (చేటితో) ఓసీ ! దుష్టురాలా ! మలయవతిని దోడుకొని నీవువెళ్ళెదవా ? మాప్రియవయస్యుఁడు మాత్ర మిటనే యుండవలయునా ?

చేటి :— ఓయీ ! తొందరపడకుము. మీకును స్నానోచిత సమయము సమీపించినది.

(మలయవతి యనురాగముతోడను సిగ్గుతోడను జీమూతవాహనుఁ జూచుచు సపరివారయై నిష్క్రమించును)

(తెరలో)

సీ॥ పటవాసవృష్టిని బజపి పటీరాద్రి
మేరుసమానమై మెఱయునట్టి
కాంతివిశేషంబు గలిగించుచునుమఱి
సింధూరములచేత బంధురమగు
బాలాతపద్యుతిశ్రీల జయించుచుఁ
గాంతాజనంబుల క్రమ పాద
పల్లవంబుల ఘలుఘల్లని మ్రోసెడి
నూపురధ్వని హృద్యమైపరగెడు

గీ॥ గానములచేత సిద్ధలోకంబునీడు
సిద్ధికోఱకిప్పుడే తెల్పు శీఘ్రముగను
మంగళస్నానవేళను మాన్యచరిత!
యాలసింపఁగరాదిట నరనిమునము. 12

ఆత్రే :— [విని] వయస్యా! స్నానమున కాహ్వానమువచ్చినది.

జీ.వా.— [సంతోషముతో] అయిననింక నాలసించుటెందులకు? తలిదండ్రులకు నమస్కరించి స్నానభూమిని జేరుదము రమ్ము.

గీ॥ సదృశరూపానురాగ ప్రశస్తవంశ
యౌవనంబులుగల్గు పుణ్యాత్ములకును
జగతి నన్యోన్యదర్శనజన్యమగు స
మాగమము కొందఱకె కల్గునని తలంతు. 13

(ఇరువురును నిష్క్రమింతురు)

ద్వితీయాంకము సంపూర్ణము





# నాగానందము



## తృతీయాంకము



(ఉన్మత్తుఁడును నుజ్జ్వలవేషుండును నగు శేఖరకుఁడును విటుఁడు పానపాత్ర చేఁబూని చేటునితోఁ బ్రవేశించును)

శేఖరకుఁడు :—

గీ॥ నిత్యమధుపాన ఘూర్ణితనేత్రుఁడైన
శేఖరకుఁడుండును బ్రియుసవాంగ
మబుఁ జేయవలంతి యాశింబచారి
యిరువురే నాకు దైవంబు లెంచిచూడ. 1

[తన్ను నిర్దేశించుకొనుచు]

ఈ శేఖరకుని జీవితమే సఫలమైనది.

గీ॥ వక్షమందున దయితయు వదనమందు
నుత్పలసుగంధమిళితమై యొప్పుమదిర
శిరమునన్ శేఖరంబును జెలుమీర
నెల్లకాలము నే ధరియించుకతన. 2

[తొట్రుపాటుతోఁ] నన్నుఁ ద్రోయుచున్నాఁ డెవఁడురా ?

[పెద్దగ నవ్వుచు] నిజముగఁ బ్రియురాలగు నవమాలికయే నన్నుఁ బరిహాసించుచున్నది.

చేటుఁడు :— భట్టారకా ! నవమాలికరాలేదు.

శేఖర :— (రోషమున) నిన్నసాయంకాలమందే మలయవతీ వివాహమహోత్సవము జరిగినదిగదా ! తెల్లవాఱినను రాలేదేమి ? [హర్షముతో] ఓహో ! మరచితిని. ఈ మలయవతీవివాహమహోత్సవ సమయమున సిద్ధవిద్యాధరబృందమెల్లఁ దమతమ ప్రియురాండ్రఁగూడి, కుసుమాకరోద్యానంబునఁ బానోత్సవ మనుభవించుచున్నది. నవమాలికయు నందే నారాక నిరీక్షించుచుండును. కావున నచ్చటికే పోయెదను. నవమాలికను జూడక క్షణమేనియు నీ శేఖరకుఁడు నిలువఁజాలఁడుగదా ! [తొట్రుపాటుతో నడచును]

చేటుఁడు :— ఇదిగో ! ఉద్యానవనము. ప్రవేశింపుఁడు.

(ఇద్దఱును బ్రవేశింతురు)

(వస్త్రయుగ్మంబును భుజముపైనిడుకొని యాత్రేయుఁడు ప్రవేశించును)

ఆత్రే :— ప్రియమిత్రుఁడగు జీమూతవాహనుఁడు కుసుమాకరోద్యానమున కేగునని వింటిని. నేను నచటికే యరిగెదను. [పరిక్రమించి] ఇదిగో ! ఉద్యానవనము. ప్రవేశింతును. (ప్రవేశించి తుమ్మెదలుమీఁద వ్రాలినట్లు నటించుచు) ఈ దుష్ట మధుకరములు నామీఁద వ్రాలుచున్న వెందులకో ? (తనశరీర మాఘ్రాణించుకొని) ఓహో ! తెలిసినది. మలయవతి బంధువులు అల్లునిమిత్రుఁడనని నాకు సగౌరవముగ శరీరమందంతటను గస్తూరీమిళితచందనంబునుబూసి,

సంతానకుసుమమాలికను గ్రొమ్ముడియం దలంకరించిరి. ఈ యత్యాదరమే నాకుమిక్కిలి యనర్థదాయకమైనది. ఈభ్రమరబాధ నివారించుకొనుట యెట్లో తోచుటలేదు. (ఆలోచించి) ఆ! స్ఫురించినది. మలయవతి యిచ్చిన యీ రక్తాంశుకయుగళమును స్త్రీవలెధరియించి, యుత్తరీయము ముసుఁగువేసికొని పోయెదను. అపుడీ దుష్టమధుకరము లేమిచేయునో చూచెదఁగాక. (అటులు చేయును)

శేఖర :— (నిరూపించి హర్షముతో) ఓరీ! చేటుఁడా! ఇదిగో! నవమాలిక నేనాలసించినందులకుఁ గోపించి, ముసుఁగు వేసికొని వేఱొక వైపునకుఁ బోవుచున్నది. కంఠాలింగన మొనరించి యీమెను బ్రీతిమాలుదును. [త్వరగ సమీపించి కంఠాలింగన మొనరించి యాత్రేయునకుఁ దమ్మ యొసంగ యత్నించును]

ఆత్రే:— (మద్యగంధము సూచించుచు ముక్కుమూసికొని పెడమొగమై) ఇపుడె యెట్లో దుష్టమధుకరముల బారి నుండి తప్పించుకొని మరల నీదుష్టమధుకరునిబారిఁ బడితినే!

శేఖర:— ఈమె కోపమునఁ బరాఙ్ముఖి యయినదే! [ఆత్రేయుని పాదములఁ దనశిరమున నిడుకొని] నవమాలికా! కోపింపకుము. అనుగ్రహింపుము.

(నవమాలిక ప్రవేశించును)

నవ :— మలయవతి తల్లిగారు "ఓసీ! నవమాలికా! కుసుమాకరోద్యానమునకుఁ బోయి యుద్యానపాలికయగు

పల్లవికతో "మలయవతీసహితుఁడై జామాతయగు జీమూతవాహనుఁ డుద్యానవిహారము చేయుటకు వచ్చును. కావునఁ దమాలవృక్షముల చాలును సిద్ధపఱుపుము" అని చెప్పవలయునని యాజ్ఞాపించినారు. అమ్మగారి యాజ్ఞ యుద్యానపాలికకుఁ దెలియఁజేసితిని. ఇపుడు విరహో త్కంఠితుఁడగు శేఖరకుఁ డెక్కడ నున్నాఁడో వెదకెదను. [చూచి] వీఁడుగో! శేఖరకుఁడు. (రోషమున) ఈతఁ డెవ్వతెనో బ్రతిమాలుచున్నాఁడే!

శేఖర :— నవమాలికా!

కం॥ హరిహర పితామహులకును
గరములుజోడింపనట్టి గర్వయుతుఁడు శే
ఖరకుఁడు నీపదములని దె
తరుణీ! పడుచున్న వాఁడు దయఁగనుగొనుమీ. 3

ఆత్రే :— ఓరీ! మదాంధా! నవమాలిక యెక్కడనున్నదిరా?

నవ :— (నిరూపించి చిఱునగవుతో) ఓహో! మదపర వశుఁడై శేఖరకుఁడు నన్నుగాభావించి యీయాత్రేయుని బ్రతిమాలుచున్నాఁడు. కృత్రిమకోపమునుజూపి వీరిద్దఱఁ బరిహసించెదను.

చేటుఁడు :— (హస్తమున శేఖరకునిఁగదలించుచు) భట్టారకా! విడు. విడు. ఇదినవమాలిక కాదు. అదిగో! నవమాలిక రోషమునఁ గన్నులెఱ్ఱఁజేసి చూచుచువచ్చుచున్నది.

నవ :— [సమీపించి] శేఖరకా! ఎవ్వరిని బ్రతిమాలు చున్నావు?

ఆత్రే :— [ముసుఁగుతొలఁగించి] నేను మందభాగ్యుఁడను ఆత్రేయుఁడను.

శేఖ :—[ఆత్రేయుని గుర్తించి] ఓరీ! పండుకోతీ! నీవును నన్నుఁబరిహసించెదవా? చేటుఁడా! వీనిని బట్టుకొనుము. నేను నవమాలికను బ్రతిమాలుదును.

చేటుఁడు :— చిత్తము.

శేఖర :— (ఆత్రేయునివిడచి, నవమాలికపాదములపైఁబడి) క్షమింపుము. నవమాలికా! క్షమింపుము.

ఆత్రే :— పాఱిపోవుటకిదియేసమయము (పరుగిడయత్నించును)

చేటుఁడు :— (ఆత్రేయుని యజ్ఞోపవీతము పట్టుకొనఁగానది తెగును) ఎక్కడకుఁబోయెదవురా? (ఆత్రేయునియుత్తరీయమునే మెడకుఁజుట్టిలాగును)

ఆత్రే :— అమ్మాయీ! నవమాలికా! క్షమించి నన్ను విడిపింపుము.

నవ :— నాపాదములపైఁబడినచో విడిపించెదను.

ఆత్రే :— [రోషముతో] ఓసీ! రాజమిత్రుండనగు నేను నీపాదములఁబడనలయునా?

నవ :— [వ్రేలితో బెదరించుచుఁ జిఱునగవున] ఇపుడేనిన్నుఁ బడవేయించెదను చూడుము. శేఖరకా! లెమ్ము. లెమ్ము. ప్రసన్నురాలనైతిని. [కంఠాలింగనమొనరించి] జామాత జీమూతవాహనుని మిత్రుఁడగు వీనిని నీవు పరిహసించితివి. ఇది విని యార్యమిత్రావసువు కోపించునేమో? కావున నీతనినాదరమున సంమానింపుము.

శేఖర :— నవమాలికా! అటులే యొనరించెదన. [ఆత్రేయుని మెడపైఁ జేయివైచి] ఆర్యా! నీవు చుట్టమవని యెంచి పరిహాసమునకై యిట్లొనరించితిమే కాని, నిన్నుఁ బరాభవించుటకుఁ గాదుసుమా! [ఉత్తరీయమును గుండ్రముగఁ జుట్టి నేలపైఁ బెట్టి] బంధురాజా! యిచ్చటఁ గూరుచుండుము.

ఆత్రే :— అదృష్టవశమున నీతని మదావేగము శాంతించి నట్లున్నది. (కూరుచుండును)

శేఖర :— నవమాలికా! యీతని ప్రక్కఁ గూరుచుండుము. ఒక్కసారిగనే మీయిరువురను సంమానింతును.

(నవమాలిక నవ్వుచుఁ గూరుచుండును)

శేఖర :— చేటుఁడా! ఈపాత్రనిండ మంచికల్లుపోయుము.

(చేటుఁడు గిన్నెనిండఁ గల్లుపోయును)

శేఖర :—[తలపూదండనుండి పూవులుతీసి పాత్రయందుంచి మోకరించి నవమాలికకొసంగుచు] నవమాలికా! త్రాగి దీనిని బవిత్రము చేయుము.

నవ:—[మందహాసముతో] అటులే యొనరింతును. [కొంచెము త్రాగి యిచ్చును]

శేఖర :— [ఆత్రేయునకుఁ బాత్రమిచ్చుచు] ఇదిగో! ఈ మద్యము నవమాలికాముఖగంధసంపర్కవర్ధితరసము. ఈ శేఖరకుఁడుతప్ప నితరుఁడెవ్వఁడును జవిచూడనిది. త్రాగుము. దీనిని మించిన సంమానములేదు.

ఆత్రే :— [తెల్లఁబోయి నవ్వుచు] శేఖరకా! నేను బ్రాహ్మణుఁడనుగదా! యెట్లు త్రాగఁగలను ?

శేఖర :—నీవు బ్రాహ్మణుఁడవైనచో నీజందెమేది? చూపుము.

ఆత్రే :— ఈచేటుఁడు లాగుటచే నిపుడే తెగిపోయినది.

నవ :—(నవ్వి) పోనిమ్ము. ఒక్కపనసచెప్పుము.

ఆత్రే :— అమ్మాయీ ! ఈమద్యగంధమువలన వేదము మరచితిని. ఇంతకును నీతో నాకు వివాదమెందులకు ? ఇదిగో ! బ్రాహ్మణుఁడనగు నేను నీకు నమస్కరించుచున్నాను. నన్ను విడిపింపుము. (నవమాలిక చరణములఁ బడయత్నించును)

నవ :— (నవ్వి హస్తముతో నివారించుచు) అయ్యా! వలదు. వలదు. శేఖరకా! నిజముగ నీతఁడు బ్రాహ్మణుఁడేయగును. ఆర్యా ! కోపింపకుము. చుట్టరికంబు పేర్మి నిన్ను పరిహాసించితిమేకాని, వేఱొండుగాదు. (ఆత్రేయుని పాదములఁ బడును) శేఖరకా ! నీవును నీతని శాంతింపఁజేయుము.

శేఖర :— నేను నీతని శాంతచిత్తునిగ నొనరింతును. [ఆత్రేయుని యడుగులపైఁబడి] మదపరవశుండనై నీయెడఁ గావించిన యపరాధంబు క్షమించి, నేను నవమాలికతోఁ బానమహోత్సవమునకుఁ బోవుట కనుజ్ఞ యొసంగుము.

ఆత్రే :— క్షమించినాఁడను. పొమ్ము. నేనును మిత్రుసిఁజూడ నేగెదను.

శేఖర :— ఆర్యా ! చిత్తము.

(శేఖరకుఁడు, నవమాలిక, చేటుఁడు నిష్క్రమింతురు)

ఆత్రే :—అమ్మయ్యా! ఇప్పటికి బ్రాహ్మణుని యకాలమృత్యువు తప్పినది. ఈ త్రాగుఁబోతుల సంపర్కమువలన మైల

వడితిని. కావున నీ బావియందు స్నానమొనరింతును. (అటులొనరించి యెదుటఁజూచి) వీఁడుగో! ప్రియమిత్రుఁడు. సాక్షాత్కరించిన వరలక్ష్మివలె నలరారు మలయవతిచేయి పట్టుకొని యిటేవచ్చుచున్నాఁడు. కావున నిచ్చటనే యుందును. (నిలుచును)

(జీమూతవాహనుఁడు, మలయవతి, చతురిక ప్రవేశింతురు)

జీ. వా :—

చం॥ చెలినునుఁజూపు చూపులను జేర్పదు పల్కదుపల్కరింప న
వ్వలి మొగమౌను దల్పమున భామిని బెగ్గిలుఁ గౌఁగిలింప నె
చ్చెలులు నివాసమందిరము చెచ్చెర వెల్వడఁ దానునేగఁగాఁ
దలఁచు నవోఢయౌ ప్రియ ముదంబధికంబుగఁ గూర్చు
వామతన్. 4

[మలయవతిఁజూచి] ప్రియా! మలయవతీ!

చం॥ ఒరులువచించుమాటలకు నుత్తరమీయకమానమూని సం
జ్వరితమొనర్చి దేహమును వహ్నిసమంబగు జ్యోత్స్నచేతనే
నిరతినిరాత్రియుంబవలు నిశ్చలతంబొనరించి ధ్యానముల్
గురుకతపఃఫలంబుగను గోమలి! కాంచితి నీముఖేందునిన్. 5

మలయ :— [చతురికతో] ఓసీ! ఆర్యపుత్రుఁడు సుందరుఁడగుటయేగాక ప్రియోక్తులు పలుకుటయందును జతురుండే!

చతు :— [నవ్వి] అమ్మా! విపరీతవ్యాఖ్యానము చేయకుము. ఇదిసత్యమే! ఇందుఁబ్రియవచనము లేవికలవు?

జీ. వా.—చతురికా! కుసుమాకరోద్యానమార్గముఁ జూపుము.

చతు :— దయచేయుఁడు.

జీ. వా.— [నడచుచు మలయవతితో] ప్రియా ! మెల్లగ రమ్ము.

ఉ॥ హారములేల ? మధ్యమతివా ! స్తనభారమెసైపదయ్యె నీ
యూరువులీనితంబభరమోర్వకయున్నవి కాంచియేల? యిం
పారఁగనూరుభారమును బాదములోపవు నూపురంబు లే
లా? రమణీయమూర్తులకలాఁతియలంకృతులెల్ల వేఁగుఁడా.

చతు :— ఇదిగో ! కుసుమాకరోద్యానము ప్రవేశింపుఁడు.

(అందఱును బ్రవేశింతురు)

జీ. వా.— [ప్రవేశించి] ఆహా ! కుసుమాకరోద్యాన మెంత రమణీయముగ నున్నది ! ఇక్కడ—

సీ॥ చందననిష్యంద సరసీకృతంబులై
వ్రతతిమండపమున వఱలు రమ్య
కుట్టిమభూములు కుదురుగఁజలువలు
దేఱె, ధారాగృహాతీరములను
జలయంత్రశబ్దము జ్జలధరగర్జితం
బనియెంచి నటియించె నల్లనెమ్మి
యంత్రముక్తంబయి యధికవేగంబునఁ
జెట్టులపాదులు శీఘ్రముగను

గీ॥ నింపుచును జలవేగాన సొంపుమీఱఁ
గంపిత ద్రుమకుసుమ సంఘాతధూళి
పింజరంబైన యీ జలవేణిమిగుల
సంతసముఁ గూర్చుచున్నది చాన ! కనుము. 7

మఱియును—

చం॥ తిరమగు గీతనాదములఁ దీవలమంటపముల్ ధ్వనింపఁబు
ష్పరజమునందుఁదాముపటవాసమునందువలెన్మునుంగుచు
న్సరగమధుద్రవంబుఁ దమచానలతోఁ దమిమీఱనానుచున్
హరువుగనిందుఁగాంచుమధుపాళులుపానమహోత్సవంబులన్

ఆత్రే:— (సమీపించి) (జీమూతవాహనునితో) జయతు
భవాన్ (మలయవతితో) స్వస్తి భవత్యై

జీ. వా.— మిత్రమా! ఆలసించితివేల?

ఆత్రే:— వయస్యా! నేను త్వరితముగనే వచ్చితిని. కాని
వివాహమహోత్సవ సమయమున సిద్ధవిద్యాధరులెల్లఁ గూడి
మధుపాన మొనరించుచుండ నావేడుకను గాంచుచు నిటు
నటుఁ దిరుగుచుండుటచేత నీసన్నిధిఁ జేరుట కొంకింత విలంబ
మైనది. నీవు నీవైభవమును విలోకింపుము.

జీ. వా.— సరే. మిత్రమా! చూడుము. ఈ విద్యాధరులు—

చం॥ ఘనహరిచందనంబలఁది కల్పసుమంబులుదాల్చి రత్నభూ
షణములకాంతిఁ జిత్రమగు స్వచ్ఛనవాంశుకముల్ ధరించి సి
ద్ధనివహాయుక్తులౌచుదయితల్ చపిచూచినమద్యమిందుఁ జం
దనములనీడలందుఁ దమిఁద్రావఁదొడంగిరి సంభ్రమంబునన్. 9

కావున మనమును దమాలవృక్షవీధి నటేపోవుదము. రమ్ము.

(అందఱునడతురు)

ఆత్రే:—ఇదిగో! తమాలవీధి. ఇది చందనలతామండపము.
(మలయవతి నుద్దేశించి) ఈమెమోము శరదాతపక్లాంత
మైనట్లు కానుపించుచున్నది. కావున నీస్ఫటికమణిశిలా
తలంబునఁగూరుచుండుఁడు.

జీ. వా:— వయస్యా! చక్కఁగఁగనిపెట్టితివి.

గీ॥ తరుణినెమ్మోము చెక్కుటద్దములస్వచ్ఛ
కాంతిచేఁ జందురుజయించి పంతమున ది
వాకరకరాభితప్తమై పద్మముల జ
యింపఁబూనుచునున్నది యిపుడు నిజము. 10

(మలయవతిచేయిపట్టుకొని) ప్రియా! ఇటఁ గూరుచుందము.

(అందఱు నుపవిష్టులగుదురు)

జీ. వా:— (మలయవతీముఖమును పైకెత్తి చూచుచు) ప్రియా! కుసుమాకరోద్యానదర్శనకుతూహలులమై మేము నిన్ను మిక్కిలి యాయాసపెట్టితిమిసుమా! ఏలయన—

గీ॥ భ్రూలతోల్లాసి నేత్రాళిభూషితంబు
పాటలాధరపల్లవ భాసితంబు
నాతి! నీముఖవనము నందనము లాఁతి
వనము పరికింపనగుఁగాదె! వట్టియడవి. 11

చతు:— (చిఱునగవున నాత్రేయునితో) ఈ వర్ణనమును వింటివా?

ఆత్రే:—(స్మితముతో) ఓసీ! చతురికా! మాప్రియవయస్యుని యీ వర్ణనమునుబట్టి యువతులుమాత్రమే చక్కనివారని గర్వింపకుము. మాత్సర్యమున వర్ణింపరుగాని మాబోఁటి యువకులయందును వర్ణనీయులు పెక్కురు కలరు.

చతు:—(చిఱునగవున) ఆర్యా! నిన్ను నేను వర్ణింతునులెమ్ము.

ఆత్రే:—[సంతోషముతో] బ్రతికితిరాజీవుఁడా! అమ్మాయీ! ఇఁకమీఁద మాప్రియవయస్యుఁడు నన్ను మర్కటశాస్త్రీ! యని పిలువకుండునట్లు మాత్రము వర్ణింపవలయునుజుమా!

చతు :— ఆర్యా! నీవు మలయవతీవివాహమహోత్సవసమయమున రాత్రియంతయు నిద్దురఁగాచి పవలుకన్నులుమూసి గాఢముగ నిద్రించుచుంటివి. అప్పుడు నీయాకారమత్యంత రమణీయముగఁ గానుపించినది. అటులే యిప్పుడును గన్నులు మూసికొని నిద్రించుచున్నట్లు నటింపుము. వర్ణించెదను. ప్రత్యక్షదృష్టవస్తువర్ణనమే మనోహరముగ నుండునుగద!

(ఆత్రేయుఁ డటులే చేయును)

చతు :— (తనలో) నీలిమందువలె నల్లనైన యీ తమాలపల్లవరసము వీనిముఖమునకుఁ బూయుదును.

(చతురిక లేచి తమాలపల్లవమును గ్రహించి పిండుచుండును)

(మలయవతీ జీమూతవాహను లాత్రేయుని ముఖము చూచుచుందురు)

జీ. వా.— వయస్యా! నీవుకడుధన్యుఁడవు. మాయెదుటనే యిట్లు వర్ణింపఁబడుచుంటివిగదా!

(చతురిక తమాలపల్లవరసము నాత్రేయుని ముఖమునకుఁ బూయును. మలయవతి మందహాసముతో నాత్రేయునిఁ జూచి జీమూతవాహనుఁ జూచును)

జీ. వా.— గీ॥ నీ యధరపల్లవంబున నెఱిఁ గననగు
మందహాస పుష్పోద్గమ మిందువదన!
చూచుచుండిన నాదు చక్షువులనిపుడు
ఫలముగల్గెను ముగ్ధాక్షి లలితరుచుగ. 12

ఆత్రే:— చతురికా! ఏమిచేసితివి?

చతు:— వర్ణించితిని.

ఆత్రే:— [చేతితో ముఖము నిమురుకొని హస్తమునుజూచి రోషమునఁ జేతికఱ్ఱయెత్తి సంభ్రమంబున] ఓసీ! యీ

రాజసన్నిధియందు నిన్నేమిచేయఁ గలను ? [జీమూతవాహనునితో] నీయెదుటనే యీదాసి నన్నవమానింప నుపేక్షించితివిగదా ! ఇఁక నిటనుండుటతగదు. ఎచ్చటికైనఁ బోయెదను.

(నిష్క్రమించును)

చతు :— ఈ యాత్రేయుఁడు నాపైఁగోపించినాఁడు. పోయి ప్రతిమాలుదును.

మలయ :—ఓసీ ! చతురికా! ఒంటరిగ నన్ను విడచిపోదువా ?

చతు :— (జీమూతవాహను నుద్దేశించి ముసిముసినగవుతో) ఇట్లేచిరకాలము నీ వొంటరిగనుండుము.

(నిష్క్రమించును)

జీ. వా :—

చం॥ అరుణకరాభిమృష్టమయి యీపరిపాటల కాంతిఁజెందిసుం
దర దశనాంశుపుంజమనునవ్యసు కేసరముల్ వహించి యిం
తిరో ! సమమౌనునీముఖమునిక్కముపద్మముతోడఁగానిబం
భరముమధుద్రవంబు నిటఁబాన మొనర్చుటఁగాంచనైతిఁగా

(మలయవతినవ్వుచు ముఖము పైకెత్తును. జీమూతవాహనుఁడు ,, అరుణకర ’’ అనుపద్యమును మరలఁజదువును)

(చతురిక ప్రవేశించును)

చతు :— (త్వరితముగవచ్చి జీమూతవాహనునితో) వీఁడుగో! సిద్ధయువరాజు మిత్రావసువు. ఎందులకో ! యిట కరుదెంచుచున్నాఁడు.

జీ. వా.— ప్రియా ! నీవింటికిఁబొమ్ము. నేనును మిత్రావసువుతో మాటలాడి యిపుఁడేవచ్చెదను.

(మలయవతి, చతురిక నిష్క్రమింతురు)

(మిత్రావసువు ప్రవేశించును)

మిత్రా:—గీ॥ శక్తిగల్గియు వైరిని జంపకిపుడు
"రిపువునీరాజ్యమెల్ల హరించె" ననుచు
భళిర ! యెట్టులు జీమూతవాహనునకుఁ
జెప్పఁగలవాఁడ ? నిసుమంత సిగ్గులేక. 14

అయిన నీతనితోఁ జెప్పి శత్రువధ యొనరించుట యుక్తము. కావున నట్లే చేసెదను. (సమీపించును)

జీ. వా.— మిత్రావసూ ! ఇచ్చటఁ గూరుచుండుము.

(మిత్రావసువు కూరుచుండును)

జీ. వా :—నీయాకారముచూడ నేదో సంరంభంబున నున్నట్లు తోఁచుచున్నదే ?

మిత్రా :— అల్పుఁడగు మతంగునియెడ సంరంభముకూడఁ గావలయునా ?

జీ. వా :— మతంగుఁడేమిచేసెను ?

మిత్రా :— ఆత్మనాశంబునకై భవదీయరాజ్య మాక్రమించు కొనెను.

జీ. వా :— (సంతోషమునఁ దనలో) ఇది నిక్కమేయయి యుండునా ?

మిత్రా :—కుమారా ! అతనిఁబరిమార్చుటకాజ్ఞయొసంగుము. వేయేల ?

ఉ॥ ఇమ్మెపుడాజ్ఞ సేనలకు నిమ్ముగనంబరమెల్ల సద్విమా
నమ్ములనావరించి దిననాథుని తేజమడంచి వర్షకా
లమ్మునఁబోలె వాసరముల న్మలినంబుగఁజేసి శత్రుసం
ఘమ్ములఁజెండి చేసెదము కైవసమాగతి స్వర్గరాజ్యమున్. 15

ఈ స్వల్పకార్యమునకు బలములుకూడఁ గావలయునా ?

ఉ॥ పెక్కులు సేనలేల? విను భీషణఖడ్గ విభాచయంబు న
ల్దిక్కులఁ గేసరంబులవలెన్నిగుడంగ మృగరాజువీఁకతో
నక్కరినాథుపై దుమికియాదటఁజీల్చువిధంబుతోఁప నే
నెక్కటికయ్యమందు వధియించెద దుష్టమతంగు నిప్పుడే. 16

జీ. వా.— (చెవులుమూసికొని) అబ్బా ! యీతని మాటలెంత దారుణముగ నున్నవి ! అయిన నీట్లువచింతును. [మంద హాసమునఁ బ్రకాశముగ] మిత్రావసూ ! బాహుబలశాలి వగు నీకెంతఘనకార్యమైన నొనరింపఁగలవు. అట్టి నీ కిది సులభమేయగును. కాని—

గీ॥ ఆత్మదేహమర్పింతుఁ బరార్థమున క
యాచితంబుగ దయపేర్మి నట్టినేను
రాజ్యలాభంబునకు ననురక్తి జీవ
హింస యొనరించుటకు నెట్టు లియ్యకొందు? 17

మఱియును—అజ్ఞానము, అహంకారము, రాగము, ద్వేషము, అభినివేశము, అను క్లేశపంచకమునఁదక్క నితరమునందు నాకు శత్రుబుద్ధియే లేదు. అట్టిచో మతంగుఁడు శత్రువే కాఁడుగదా ! నాకుఁ బ్రియమొనరింప నెంచెదవేని, దీనుండును, క్లేశదాసుండునగు మతంగునిఁ గరుణింపుము.

మిత్రా :— (అమర్షమునఁ దొందరతో) మనయెడ నాతఁడు గావించిన యపకారంబునకుఁ గరుణించుటయెట్లు ?

జీ. వా.– (తనలో) ప్రత్యగ్రకోపాక్షిప్తచిత్తుఁడగు వీని నిపుడు నివారించుట కష్టము. కావున నిట్లుచెప్పెదను. (ప్రకాశముగ) మిత్రావసూ ! ఇంటికిఁబోవుదము రమ్ము. అచ్చట నిందలి తత్త్వమును బోధించెదను. ఇపుడు సాయంసమయ మయినది. చూడుము—

ఉ॥ నీరజకోరకంబులను నిత్యముఁదా వికసింపఁజేసి ది
క్పూరకనైజదీధితుల ముజ్జగముల్వెలిఁగించి సిద్ధులిం
పార స్తుతింప నస్తమునునందుచు నుండి పరార్థసిద్ధికే
భూరిప్రయాసమొందు నల పుణ్యుఁడు సూర్యుఁడె శ్లాఘ్యు
డిత్తఱిన్. 18

(ఇరువురు నిష్క్రమింతురు)

( తృతీయాంకము సమాప్తము )





# నాగానందము

## చతుర్థాంకము

(వస్త్రయుగ్మమును బట్టుకొని కంచుకియుఁ బ్రతీహారుఁడగు సునందుఁడును ప్రవేశింతురు)

గీ॥ సరిగ నంతఃపుర వ్యవస్థల నొనర్చి
ప్రతిపదస్ఖలితంబుల రిహాని గాచి
యేఁ జరాపీడితుండనై యిప్పుడుఁ గంప
నీతి ననుసరింపక స్ఖలత్వ మొందెఁ జిక్కి. 1

సునం :— ఆర్యా! ఎచ్చటికిఁ బయలుదేరినారు?

కంచు :— పూజ్యురాలగు మిత్రావసుజననిగారు "కంచుకీ! పదిరాత్రులు పూర్తి యగునంతకును మలయవతికిని, జీమూతవాహనునికిని రక్తాంశుకము లిచ్చుచుండవలయు"నని నాకాజ్ఞ యొసంగిరి. రాజపుత్రిక యత్తవారింట నున్నది. జీమూతవాహనుఁడు యువరాజగు మిత్రావసువుతోఁ గూడి సముద్రతీరంబునఁగల విశేషము లరయుటకిపుడే వెళ్ళెనని వినియుంటిని. ప్రథమమున వీరిరువురిలో నెవరియొద్దకుఁ బోవుట యుక్తమో తెలియఁజాలకున్నాఁడను.

సునం :— ఆర్యా! ఒకవేళనీసమయంబునకు జీమూతవాహనుఁ డచటికేగియుండును. కావున మలయవతియొద్దకుఁబోవుటయే యుచితము.

కంచు :— సునందా! చక్కగనున్నది. నీవెచ్చటికేగుచున్నావు?

సునం :— మహారాజగు విశ్వావసువు, "సునందా! నీవేగి మిత్రావసువుతో "ఈ స్థాలీపాకోత్సవసమయంబున మలయవతికిని, అల్లునికిని మహోత్సవానురూపమగు సంమానము చేయవలసియున్నది. నీవువచ్చి యద్దానిని సిద్ధపఱుపుము" అనిచెప్పవలయునని నాకాజ్ఞయొసంగెను. కావున నేను మిత్రావసువునాహ్వానించుటకరిగెదను. నీవును రాజపుత్రిసన్నిధికిఁబొమ్ము.

(ఇద్దఱును నిష్క్రమింతురు)

(ఇదివిష్కంభకము)



(జీమూతవాహనుఁడును, మిత్రావసువును ప్రవేశింతురు)

జీ. వా :—

సీ॥ వరమృదుశయ్య శాద్వలభూమి యాసనం
బతిశుచిశిల సద్మ మగమమూల
మతిశీతమగు నిర్ఝరాంబువు పానంబు
నశనంబు కందమూలాదికంబు
సాహాయ్యమొనరించుసన్మిత్రులు మృగంబు
లీరీతిఁబ్రార్థింపకేలభించు
సర్వభోగద్రవ్యసంపూర్ణమైన యీ
వనము శ్లాఘ్యమెయగు వసుధలోనఁ

గీ॥ గాని దుర్లభయాచకగణకమైన
దీనియందొక్క దోషంబుకానఁబడెడి
స్వార్థమునుద్యజియించి పరార్థసిద్ధి
పూనియొనరించు వారలు లేనికతన. 2

మిత్రా:— (పైకిఁజూచి) కుమారా! త్వరపడుము. త్వరపడుము. సముద్రము పొంగుట కిదియే సమయము.

జీ. వా.— చక్కగ గమనించితివి.

గీ॥ వివిధజలజంతుఘోషవివృద్ధమగుచు
ధరదరీభాగములఁ బ్రతిధ్వనులనీని
వీనులకు దుస్సహంబయి వెలయుట ధ్వని
జలధి పొంగెనటంచును దలఁతుమదిని. 3

మిత్రా:— కుమారా! సముద్రము పొంగి రానేవచ్చినది. చూడుము—

గీ॥ కరిమకరసంఘములు లవంగములపల్ల
వములు కబళించియుమియఁ దత్సరిమళమును
జెంది రత్నప్రభానురంజితమునయిన
జలముతోఁగూడి యీవేల జానుమీఱు. 4

జీ. వా.—మిత్రావసూ! చూడుము. శరత్కాలధవళములైన పయోధరపటలంబు లావరించుటచేత నీ మలయపర్వత సానువులు హిమవన్నగశిఖరశోభను వహించుచున్నవి.

మిత్రా:— కుమారా! ఇవి మలయపర్వతసానువులుగావు. దందశూకమ్ముల యెమ్ములపోగ్రువులుగదా!

జీ.వా.— (ఉద్వేగముతో) అయ్యో! యెంతకష్టము! సర్పములకిట్లు సంఘమరణ మెట్లు వాటిల్లినది?

మిత్రా:— కుమారా! వీనికి సంఘమరణము కలుగలేదు.

జీ. వా.— ఎందువలన నింత యస్థిసంచయ మేర్పడినది?

మిత్రా:— కుమారా! వినుము. తొల్లి వినతానందనుండగు గరుత్మంతుఁడు స్వపక్షమారుతంబున సాగరజలంబును సయితం మెగురఁగొట్టి యుక్కుమీఱి పాతాళలోకంబున కరిగి ప్రతిదినంబును భుజంగమంబులఁ గొనివచ్చి భక్షించు చుండెను.

జీ. వా.— (ఉద్వేగమున) అయ్యో! అతిఘోరకార్య మొన రించుచున్నాఁడే! పిదపనేమయ్యెను?

మిత్రా:— పిమ్మట నాగరాజు వీనిమూలంబున భుజగ సముదాయమెల్ల నేకకాలంబుననే నశించునని భయపడి గరుత్మంతున కిట్లు విన్నవించెను.

జీ. వా.— (ఆదరముతో) తన్ను భక్షింపుమనెనా?

మిత్రా:— లేదు. లేదు.

జీ. వా.— ఇంకేమనెను?

మిత్రా:— వినుము. "భవదీయాగమనత్రాసంబున భుజం గాంగనలకు గర్భస్రావంబగుచున్నది. శిశువులు మరణించు చున్నవి. ఇట్లయినచో మాసంతతి నశించును. నీకు స్వార్థ హానియు వాటిల్లును. నీవుపాతాళంబునకు రాఁబనియు నుండదు. కావున నీవు సముద్రతీరంబున నుండుము. ప్రతి దినంబు నొక్కొక సర్పమును నీయొద్దకుఁ బంపెదను. ఇట్లయినచో మనకెల్లరకును క్షేమముకలుగును." అని చెప్పెను. గరుత్మంతుఁడు నందులకంగీకరించెను.

గీ॥ నిర్ణయంబిట్టులొనరించి నిత్యమునను
వైనతేయుఁడు తినెడి సర్పముల మంచు
కొండవలెనొప్పు నెమ్ములకుప్పలిటులు
పొందె వృద్ధిని, పొందును, పొందఁగలవు. 5

జీ. వా.— ఎంతకష్టము ? స్వార్థతత్పరుఁడగు నాగరాజు పన్నగంబులను రక్షించునెపంబున నాత్మరక్షణమె యొనరించుకొనెనుగదా !

గీ॥ ఏకనాగరక్షణమున కే శరీర
మర్పణమొనర్తునని పల్కననువుపడెడి
యొక్కనాల్కయు లేదయ్యె నురగపతికి
రెండువేలనాల్కలవేలమండిపోనె? 6

ఆశ్చర్యము. ఆశ్చర్యము.

గీ॥ ధరణి సర్వాశుచిత్వనిధానమగుచు
నశ్వరంబును నతికృతఘ్నమును నైన
కుత్సితశరీరరక్షకై ఘోరపాప
ములను గావింతురెన్నని మూఢమతులు. 7

అయ్యో ! పాపము. యీపాములయాపద కంతములేదుకదా ! (తనలో) మదీయశరీరార్పణంబున నొక్కపామునైన రక్షించు భాగ్యములభించునా ?

(సునందుఁడు ప్రవేశించును.)

సునం :— గిరిశిఖరమధిష్ఠించితిని. (చూచి) ఓహో ! మిత్రావసువు జామాతయగు జీమూతవాహనుని సమీపముననే యున్నాఁడు. అచటికేఁబోయెదను. (దగ్గఱకుఁబోయి నమస్కరించి) కుమారులకు జయము.

మిత్రా:— సునందా! ఇటకేలవచ్చితివి?

సునం:— (మిత్రావసువు చెవిలో నేదియోచెప్పును)

మిత్రా:— (జీమూతవాహనునితో) కుమారా! మాతండ్రి గారు నన్నుఁ బిలుచుచున్నారఁట.

జీ. వా.— త్వరితముగఁ బొమ్ము.

మిత్రా:— కుమారా! నీవును ప్రత్యవాయభూయిష్ఠమగు నీప్రదేశంబునఁ గుతూహలాతిశయంబునంజేసి యాలసింపక శీఘ్రముగ రమ్ము.

(మిత్రావసు, సునందులు నిష్క్రమింతురు)

జీ. వా.— నేనును గిరిశిఖరమునుండి దిగి సముద్ర తటమునఁ గల విశేషము లవలోకింతును. (నడచును)

(తెరలో)

అయ్యో! కుమారా! శంఖచూడా! నాకన్నుల యెదుటనే నీవు మరణించుచున్నావు. ఎట్లుసహింతును?

జీ. వా.— (విని) ఏమీ! స్త్రీయార్తప్రలాపమువలె వినఁబడు చున్నది! ఇపుడేపోయి, యీమెయెవ్వరో, భయనిమిత్త మేదియో, తెలిసికొందును. (పరిక్రమించును)

(పెద్దపెట్టున నేడ్చుచు వృద్ధ వెంటరాఁగా శంఖచూడుఁడును, వస్త్రయుగళము పట్టుకొని కింకరుండును బ్రవేశింతురు)

వృద్ధ:— (కన్నీరుగార్చుచు) అయ్యో! కుమారా! శంఖ చూడా! నీమరణంబును నేను గన్నులారఁ గాంచుచుంటిని గదరా! నేనెంతపాపాత్మురాలనురా! (గడ్డము పట్టుకొని) నీముఖచంద్రుఁ డస్తమింపఁ బాతాళమంధకారావృత మగును గదా!

శంఖ :— అమ్మా! పుత్రవాత్సల్యంబున నత్యంతదుఃఖిత వై యాయాసపడకుము.

వృద్ధ :— (తేఱిచూచి పుత్రునిశరీరము నిమురుచు) అయ్యో! పుత్రకా! సూర్యకిరణములనైన నెఱుంగక యతిసుకుమారంబగు నీశరీరంబును నిర్దయహృదయుండై గరుడుం డెట్లాహారముగా నొనరించుకొనునురా? (కంఠమునఁ గౌఁగిలించుకొని యేడ్చును)

శంఖ :— అమ్మా! దుఃఖముతగ్గించుకొని యిదివినుము.

గీ॥ ధరణి జన్మించుప్రాణిని దాదివోలె
నిత్యముగనాక్రమించు ననిత్యత ప్రథ
మమునఁ, బిమ్మట జనని, యాక్రమమెనిజము
కాన శోకింపఁబనిలేదు కన్నతల్లి! 8

వృద్ధ :— అయ్యో! తనయా! ఒకక్షణమైనను నీముఖమును జూడనిమ్మ.

కింక :— కుమారా! రమ్ము. ఈమెమాటలతో నీకేమి ప్రయోజనముకలదు? పుత్రవాత్సల్యవిక్లబయగు నీమె రాజకార్యత్వర నెఱుంగఁజాలదు.

శంఖ :— ఇదిగో! వచ్చుచున్నాను.

కింక :— (తనలో) శంఖచూడునివధ్యశిలయొద్దకుఁ దీసికొనివచ్చితిని. ఇఁక వధ్యచిహ్నమగు నీరక్తాంశుకయుగళము నీతనికొసంగి వధ్యశిలఁ జూపెదను.

జీ. వా.— ఆ విలపించు వనిత యీమెయే! (శంఖచూడునిఁ జూచి) ఎవనికొఱకీమెదుఃఖించుచున్నదో, యట్టియాతఁ డీమె పుత్రుఁడు కానోపు. (అంతటనుజూచి) భయపడుటకు

లేశమేనియుఁ గారణము కానిపింపదు. ఎందువలన నిట్టి భయము సంభవించెనో, యడిగి చూతునా? అయిన నిపు డడుగ నక్కఱలేదు. పరిసంగము ప్రారంభ మయినది. దీని వలననే వ్యక్తము కావచ్చును. కావునఁ జెట్టుచాటున నుండి యాలకించెదను.

కింక:— (కన్నీరు గార్చుచుఁ గృతాంజలియై) కుమారా! శంఖచూడా! అతినిష్ఠురమగు ప్రభువు నానతిని వినిపించుటకు భయపడుచున్నాను.

శంఖ :— భయమెందులకు? చెప్పుము.

కింక :— నాగరాజగు వాసుకి యాజ్ఞాపించుచున్నాఁడు.

శంఖ :— (శిరమున నంజలియుంచి యాదరంబున) ప్రభువుగా రేమని యాజ్ఞాపించినారు?

కింక :— "ఈ రక్తాంశుక యుగళము ధరించి వధ్యశిలపైఁ గూరుచుండుము. రక్తాంశుకచిహ్నమునుజూచి గరుత్మంతుఁ డాహారముగఁ గొనిపోవును" అని.

జీ. వా.— (కన్నులనీరొలుక) అయ్యో! పాపము. ఈదీనుఁడు వాసుకిచేతఁ బరిత్యక్తుఁడయ్యెనే!

కింక :— శంఖచూడా! దీనిని బరిగ్రహింపుము. (వస్త్ర యుగళము సమర్పించును)

శంఖ :— (ఆదరమున) తెమ్ము. (తీసికొని ప్రభువు నానతిని శిరసావహించును)

వృద్ధ :— (పుత్రుని హస్తమున వస్త్రములఁజూచి రొమ్ము బాదుకొనుచు) అయ్యో! బిడ్డా! వధ్యచిహ్నమయిన యీ

వస్త్రయుగ్మమును జూచిన నాహృదయము కంపిల్లుచున్నది. (మూర్ఛపోవును)

కింక :— గరుత్మంతుఁడు వచ్చువేళ యైనది. త్వరితముగఁ బోవుదును. [నిష్క్రమించును]

శంఖ :— తల్లీ! ఊరడిల్లు మూరడిల్లుము.

వృద్ధ :— [ఊరడిల్లి కన్నీటితో] అయ్యో! బిడ్డా! అయ్యో! పుత్రకా! అయ్యో! నా నోములపంటా! మరల నిన్నెక్కడఁ జూతునునాయనా!

జీ. వా.— [కన్నీటితో] ఆహా! గరుత్మంతుఁడెంత దయావిహీనుఁడు; మఱియును—

ఉ॥ కన్నులనీరుకాల్వలుగఁ గావుఁడుపుత్రకునంచు దిక్కులన్
దిన్నగఁజూపులన్పఱపి దీనతతోవిలపించుచున్న యీ
యన్నవయంకమందుఁగల యర్భకునిర్దయఁజంపనున్న యీ
పన్నగవైరిమానసమె వజ్రమయంబగుఁ గాదు చంచువున్. 9

శంఖ :— [తల్లికన్నీరు తుడుచుచు] అమ్మా! దుఃఖపరాధీనవు కాకుము. ఊరడిల్లుము. ఊరడిల్లుము.

వృద్ధ :— [కన్నీటితో] పుత్రకా! నాకు నీవొకఁడవే తనయుఁడవని కరుణించి నాగరాజు నిన్ను విడువలేదుగదా! నా మానసంబున కూఱట యెట్లుకలుగును? అయ్యో! కృతాంతహతకా! లోకంబున నెన్నియో జీవరాశులుండ నిర్దయుండవగు నీకు నాపుత్రకుఁడే కానుపించెనా? మందభాగ్యురాలను హతనైతినిగదా!

(మూర్ఛిల్లును)

జీ. వా.—గీ॥ ఆర్తుఁడును గంఠసంగతప్రాణుఁడు మఱి
తనదు బంధుగణంబుచేఁ ద్యక్తుఁడైన
వీని రక్షింపలేకున్నఁ బూని నా శ
రీరమున నేమిలాభము ? పృథివిలోన. 10

కావున నచటికేగెదను.

శంఖ:— అమ్మా ! మనసు కుదురుపఱుచుకొనుము.

వృద్ధ:— హా పుత్రికా! శంఖచూడా! నాకూరట దుర్లభము కదా ! నాగలోకరక్షకుఁడగు వాసుకియే స్వయముగనిన్నుఁ బరిత్యజింప నిఁక రక్షించువారెవరు ?

జీ. వా.—(సమీపించి) ఇదిగో ! నేనున్నాఁడను.

వృద్ధ:— [సంభ్రమమున నుత్తరీయముతోఁ బుత్రునిగప్పి జీమూతవాహను సమీపించి] గరుడా ! వినతానందనా ! నన్ను జంపుము. నేను నీకాహారముగఁ గల్పింపఁబడితిని.

జీ. వా.—[కన్నీటితో] ఆహా ! ఈమె పుత్రవాత్సల్య మత్యుత్కటముగదా !

గీ॥ పుత్రవత్సలయగునీమెపొందు విక్ల
బత్వమునుగాంచి యకరుణస్వాంతుఁడైన
భుజగశత్రువైనను మదిభూరికరుణఁ
బూనుననుచుఁ దలంతు నామానసమున. 11

శంఖ:— తల్లీ ! భయపడకుము. ఈతఁడు నాగశత్రువు కాఁడు. చూడుము.

గీ॥ ఘోరపన్నగదేహ విదారణోత్థ
రక్తధారాక్తచంచువై రహి భయంక

రుండగు ఖగేశ్వరుండేడ ! రోహిణీశ
సౌమ్యభావాకృతియగు నీ సాధువేడ ! 12

వృద్ధ :— అయ్యో! కుమారా ! నీ మరణభయమున నాకుఁ బ్రపంచమెల్ల గరుడమయముగఁ గానుపించుచున్నది.

జీ. వా.— అమ్మా ! భయమునొందకుము. నేను విద్యాధరుఁడను. నీ సుతుని రక్షించుటకే యిట కరుదెంచినాఁడను.

వృద్ధ :— (హర్షముతో) నాయనా ! ఆమాట యింకొకమాఱు వచింపుము.

జీ. వా.— తల్లీవట్టిమాటలతో నేమిప్రయోజనము కలదు ? క్రియారూపముననే నెఱవేర్తును.

వృద్ధ :— (చేతులుజోడించి) పుత్రి ! చిరంజీవ.

జీ. వా.—

గీ॥ అమ్మరో ! తెమ్ము వధ్యచిహ్నమ్ము దీనిఁ
గప్పుకొని నీదుతనయునిఁగాచుపొంటెఁ
జేరినా దేహమిప్పుడాహారముగను
వైనతేయునకర్పింతుఁ బ్రమదమెసఁగ. 13

వృద్ధ :— (చెవులుమూసికొని) అమంగళము ప్రతిహతమగుఁగాక. నాయనా ! నీవు మా శంఖచూడునివంటివాఁడవేయగుదువు. మఱియును బంధుజనులుకూడవిడచిన నాపుత్రుని నీ శరీరమర్పించి రక్షింపనుద్యుక్తుఁడవయిన నీవు శంఖచూడుని కంటె మిన్నవని చెప్పవలయును.

శంఖ .— (సస్మితముగ) ఓహో ! యీతనిచరిత్రము లోకోత్తరముగనున్నదికదా ! ఏలయన—

సీ॥ మున్ను విశ్వామిత్రముని వేనికోఁ టకుఁ దా
శ్వపలలమును దినె శ్వపచుపోలె
నుపకారియనియైన నల్లమం దెంచక
ధనలోభమునను నధర్మవృత్తి
గౌతముఁడనువాఁడు కడఁగి నాడీజంఘుఁ
జంపె నెవ్వానికై జాలిలేక
కాశ్యపపుత్రుఁడీ గరుడుండు వేనికై
పాములఁదినుచుండెఁ బ్రతిదినంబు

గీ॥ నట్టిప్రాణంబులను దృణప్రాయముగఁ బ
రార్థములనుసాధింపఁగ నధికకృపను
విడచు పీనిచరిత్రంబు వింతయయ్యె!
నిట్టియౌదార్యమెందును నెఱుఁగనుగద! 14

(జీమూతవాహనునితో) ఓ మహాత్మా! ఆత్మార్పణనిశ్చయము వలన నీవు నాయెడదయాళుత్వమును జూపినందుల కెంతయు సంతసమయ్యె. కాని, యిట్టినిర్బంధమువలదు. ఏలయన—

గీ॥ పుట్టుచుండును మఱియును గిట్టుచుండు
నిలను మముఁబోలు క్షుద్రజంతులు నిజంబు
పరులకుపకారమొనరింప బద్ధదీక్షు
లయిన మీవంటి పుణ్యాత్ము లరుదు జగతి. 15

కావున నోమహానుభావా! యీప్రయత్నమును మానుము.

జీ. వా.— (శంఖచూడునిహస్తము పట్టుకొని) కుమారా! శంఖచూడా! పరార్థము సాధింపవలయునని చాలకాలము

నుండియు నభిలాషపడుచున్నాను. కాని నామనోరథము నెఱవేఱదయ్యె. నేఁటికి సమయము లభించినది. దీనిని విఘ్నపఱుపకుము. (పాదములపైఁబడి) సందేహింపక వధ్యచిహ్నము నాకొసంగుము.

శంఖ :— ఓ! మహాసత్త్వా! ఈ వృథాప్రయాసమువలన నేమిప్రయోజనముకలదు? శంఖధవళమగు శంఖపాలుని కులమున కీ శంఖచూడుఁడు కళంకము నాపాదింపఁడని నమ్ముము. మాయందు నీకు దయకలదేని నాయాపదవలన శోకార్తయగు మాతల్లి ప్రాణములనుపీడక నిలుపుకొనుట కేదైన నుపాయము కలదేని నాలోచింపుము.

జీ. వా.— ఉపాయమాలోచించియే యున్నాఁడను. కాని యది మాత్రము నీయధీనమయియున్నది.

శంఖ :— ఎట్లు?

జీ. వా.— గీ॥ నీవుమరణింప మరణించు నీవుబ్రదుకఁ
బ్రదుకు నీమాతజీవింపవలయునేని
నాత్మరక్షణమొనరింపుమా! మదీయ
ప్రాణములచేత నిపుడనురక్తిమీఱ. 16

ఇదియే యుపాయము. వేఱొండులేదు. కావున శీఘ్రముగ వధ్యచిహ్నమర్పింపుము. దీనిని గప్పికొని వధ్యశిల నారోహించెదను. నీవును దల్లినిఁదోడ్కొని యీప్రదేశంబు నుండి వెడలిపొమ్ము. నీ జనని సమీపవర్తియగు నీ వధ్య శిలను గాంచియే స్త్రీజనసహజమగు భయాతిరేకంబునం జేసి ప్రాణంబులు విడచునేమో? అదియునుగాక విపన్న

పన్నగానేకకంకాళసంకులంబైన యీమహాస్మశానంబును నీవు వీక్షించియుండలేదా ?

ఉ॥ ముక్కులఁజాఁచునామిషపుముక్కలఁదాముగ్రసించునాశ న
ల్దిక్కులఁ జేఁకటుల్గవియ దీకొనిగద్దలు ఱెక్కలార్చ నీ
చక్కని రక్తమాంస ఘనసాంద్రప్రవాహనిమగ్నమైన యీ
నక్కలనోటి మిన్నగురు లనారతమున్ చుఱ్ఱ చుఱ్ఱ చుఱ్ఱనున్. 17

శంఖు:— చూడకేమి ?

గీ॥ ప్రతిదినము పన్నగాహారయుతమగుచు, వి
నాయకాహితప్రీతిని బాయక శశి
పాండురాస్థి కపాలసంభరితమయి స్మ
శానమిది రుద్రుదేహంబు సరణినొప్పు. 18

కావునఁ బొమ్ము. ఈబిభీషికలవలఁ బ్రయోజనములేదు. గరుత్మంతుఁడు వచ్చువేళయైనది. (తల్లియెదుట మోఁకరించి శిరమున నంజలిబంధించి) తల్లీ ! నీవును మరలిపొమ్ము.

గీ॥ అమ్మరో ! యెన్నిభవములకైన నీవె
తల్లివగుమమ్మ ! నాకుసంతసముగల్గ
పుత్రవాత్సల్యమున నినుఁబోలుసతులు
జగతిలో లేరు లేరు నిజమ్ము జనని! 19

(పాదములఁబడును)

వృద్ధ:— (కన్నీటితోఁదనలో) అయ్యో ! దైవమా ! ఇదియే యీతని యవసానవాక్యముగాఁదోఁచుచున్నది. (ప్రకాశముగ) పుత్రకా ! నిన్నువిడచి నే నెటకుఁబోవఁగలను ? నీతోడనేవచ్చెదను.

శంఖ :— (లేచి) నేనును సమీపమునఁగల భగవానుఁడైన దక్షిణగోకర్ణునికిఁ బ్రదక్షిణమొనర్చి పరిభవునానతి నెఱవేర్చెదను.

(శంఖచూడుఁడు, తల్లియు నిష్క్రమింతురు)

జీ. వా.— అయ్యో! నాయభిలాషము సిద్ధింపదయ్యెనే! యేమిచేయుదును?

(త్వరితముగఁగంచుకి ప్రవేశించును)

కంచు :— ఇదిగో! వస్త్రయుగ్మము.

జీ. వా.— (చూచి హర్షించుచుఁ దనలో) అదృష్టవశమున యాదృచ్ఛికలబ్ధమగు నీ రక్తాంశుకయుగళంబుచే నా యభీష్టము నెఱవేఱినది.

కంచు :— కుమారా! ఈవస్త్రయుగ్మమును దేవియగు మిత్రావసుజనని తమకుఁబంపెను. ధరింపుము.

జీ. వా.— తెమ్ము.

(కంచుకియిచ్చును)

జీ. వా.— (తీసికొని తనలో) మలయవతీపాణిగ్రహణవిధి సఫలమయినది. (ధరించి ప్రకాశముగ) కంచుకీ! పొమ్ము. దేవికి నా నమస్కారమును దెలుపుము.

కంచుకి :— చిత్తము. (నిష్క్రమించును)

జీ. వా.—గీ॥ మంచిసమయంబుననె లభియించె రక్త
వస్త్రయుగ్మ మిప్పట్టునఁ బరులకొఱకు
దేహముఁ బరిత్యజింపఁగాఁ దివురునాకు
నెంతయును బ్రీతిఁగల్గించు స్వాంతమునను. 20

(దిక్కులు పరికించి) మలయాచలశిఖరశిలాసంచయంబును సయితము గదలించుచుఁ బ్రచండంబగు గాలి వీచుచున్నది. కావునఁ బక్షిరాజగు గరుత్మంతుఁడు దగ్గఱకు వచ్చుచున్నాఁడని తోఁచుచున్నది. మఱియును—

చం॥ ప్రళయఘనాఘనాభమగు పక్షతిపంక్తులు మిన్నుగప్పెడిఁ
జలధిజలంబు వేగమున సంచలితంబయి భూమిఁగ్రమ్మెఁ గం
దళితశరీరకాంతి తగ ద్వాదశసూర్యులకన్న మిన్నయై
దళముగసర్వదిక్కులను దాఁ గపిశద్యుతిఁ గూర్ప దిగ్గజం
బులుప్రళయంబొకోయనెడుబుద్ధినిభీతిలఁజొచ్చెహెచ్చుగన్

కావున నీ శంఖచూడుఁడు రాకమునుపే త్వరితముగఁబోయి వధ్యశిల నారోహించెదను. [అటులొనరించి, కూరుచుండి, స్పర్శసుఖ మభినయించుచు] ఆహా! యీవధ్యశిలాతల స్పర్శ మెంత హాయిగా నున్నది!

గీ॥ మలయజరసార్ద్రమైన యీ మలయవతి స్పృ
శింపఁగల్గిన సౌఖ్యసుశ్రీలకంటె
నభిమతార్థసంసిద్ధికి ద్వారమైన
వధ్యశిలస్పర్శమేమిన్న తథ్యమిపుడు. 22

మలయవతీస్పర్శ మెంతటిది!

గీ॥ వధ్యశిలపైన నీయెడఁబవ్వళింపఁ
గల్గినసుఖంబు శైశవకాలమందు
జననియొడిలోన స్వేచ్ఛతోడను బరున్న
యప్పుడైన లభింపలే దరయ నాకు. 23

పీఁడుగో! గరుత్మంతుఁడు రానేవచ్చెను. శరీరముగప్పికొని యుందును. (అటులొనరించును)

(గరుత్మంతుఁడు ప్రవేశించును)

గరు :-- సీ॥ చంద్రబింబంబును జయ్యనవిరసించి
భయకృతవలయమై పరఁగ శేష
మూర్తిని సంకోచమునునొందఁజేయుచు
భయసంభ్రమంబున వాహనములు
బెదర రథంబునఁ బదిలంబుగానున్న
యాదిత్యుఁడు చలింప నన్నగారి
చే సంతసమున వీక్షితుఁడనై వేగవ
శంబునఁబ్రాంతసంసక్తమైన
గీ॥ మెఱపుతోఁగూడియుండిన మేఘమాల
చేత నాయతమౌ గరుచ్ఛ్రీవహించి
సర్పములఁదినునాశచే క్షణములోన
వచ్చి చేరితి మలయపర్వతము నిపుడె. 24

జీ. వా.—గీ॥ ఈశరీరదానంబున నిపుడు నేను
భోగిరక్షించియార్జించు పుణ్యమునను
బ్రతిభవంబున నాకిట్లు వఱలుఁగాత
స్థిరముగఁ బరార్థమేకద దేహలబ్ధి. 25

గరు :— (జీమూతవాహనుని దేఱిచూచి)

చం॥ భయపరిదీర్యమాణమగు వక్షమునుండి స్రవించు రక్తసం
చయమున లిప్తమైనటులు సంవృతరక్తపటంబు పాములన్
దయమనుపంగ వధ్యశిలఁ దాఁబలితంబునునైన దీని ని
శ్చయముగ వజ్రదండనిభచంచువుచేతను జీల్చి మెక్కెదన్.

(పైఁబడి జీమూతవాహనునిఁ బట్టుకొనును. దుందుభులు మ్రోఁగును. పుష్పవృష్టి కురియును. విని, పైకిఁ జూచి)

ఓహో! వింతగనున్నదే! దుందుభులు మ్రోఁగుచున్నవి. పుష్ప వర్షము కురియుచున్నది.

చం॥ పరిమళనందితాళిగ నభస్థ్సలిఁ బుష్పసువృష్టి గల్గెడిన్
సరవిని దేవదుందుభినినాదము దిక్కులఁబిక్కటిల్లెడున్
(కవి)
సరి. తెలిసెన్మదీయజవసంభ్రమమారుతధూతమయ్యె నా
సురకుజమంతకాలమనుచు న్ప్రళయాబ్దములెల్ల గర్జిలెన్. 27

జీ.వా.—(తనలో) అదృష్టవశమునఁ గృతార్థుఁడనైతిని.

గరు:— (పరిశీలించుచు)

గీ॥ రక్తిమీఱఁగఁ బన్నగప్రకరములను
గాచునీతఁడు గురువుగఁ దోఁచెనాకుఁ
గాన సర్పాశనాపేక్షఁ గడఁగివెడల
నడఁచునంచుఁ దలంతు నా స్వాంతమందు. 28

కావున నీమలయశిఖర మారోహించి యథేష్టముగ భక్షింతును.

(జీమూతవాహను నెత్తికొని నిష్క్రమించును)

(చతుర్థాంకము సంపూర్ణము)



# నాగానందము



## పంచమాంకము



(సునందుఁడను ప్రతీహారుఁడు ప్రవేశించును)

సునం:— గీ॥ హితజనము మందిరోద్యానగతమె యైన
ఘనపరాక్రమహీనమునఁ గలుగు భీతి
బహ్వపాయభూయిష్ఠమహా భయపు విపిన
సీమ వసియింప నింకేమి చెప్పవలయు? 1

సముద్రతీరంబునఁగల విశేషములవలోకించుటకై జీమూతవాహనుఁ డిప్పటికిని రాకుండుటచేఁ గలఁతనొంది విశ్వావసుమహారాజులుంగారు "సునందా! గరుత్మంతుని భయముగల ప్రదేశంబునకు జామాతయగు జీమూతవాహనుఁ డరిగి యాలసించుటచే నాకు మిక్కిలి భయముగల్గుచున్నది. నీవేగి యాతఁడు స్వగృహమును జేరెనో, లేదో, తెలిసికొనిరమ్ము" అని సెలవిచ్చిరి. కావున నచటికిఁ బోయెదను. (నడచి యెదుటఁజూచి) ఓహో! జీమూతవాహనుని తండ్రియగు జీమూతకేతువు పర్ణశాలముంగిలియందు భార్యయుఁ గోడలును సేవించుచుండ సుఖాసీనుఁడై యున్నాఁడు.

సీ॥ చిత్రవిన్యాసవిశేష యుక్తంబును
నల్పనిశ్వాస ధూతాంచలంబు
నై యొప్పు ధవళపట్టాంబరయుగ్మంబు
ధరియించి జాహ్నవికరణిఁ బుణ్య
రాలును ననురూప యగు మహాపుణ్యయక్
సార్థకనామయౌ సాధ్విఁగూడి
భంగడిండీర పరివర్తియు హంసాది
పూరితంబును మహాపుణ్యమైన

గీ॥ జాహ్నవినిగూడినట్టి యా జలధివోలెఁ
దనరు జీమూతకేతు వుదారసరణి
నట్టి వీనియంతికమున నలరు సాధ్వి
మలయవతి వేలవలెను భాసిలఁదొడంగె. 2

కావున సమీపించెదను.

(సముచితాసనస్థుఁడై పత్నీవధూ సమేతంబుగ జీమూతకేతువు
ప్రవేశించును)

జీ. కే.—గీ॥ సుఖము లనుభూతములు, యశస్సును లభించె,
స్థిరము రాజ్యము, తపము సుస్థిరతఁ గృతము,
శ్లాఘ్యుఁడుసుతుండు, స్నుషయును సత్కులీన,
తగఁ గృతార్థుఁడ. మృత్యుచింతన మొనర్తు. 3

సునం.— (తొందరగఁ బ్రవేశించి) జీమూతవాహనునకు—.

జీ. కే.— (చెవులు మూసికొని) పాప ముపశమించునుగాత.

దేవి.— అమంగళము ప్రతిహతమగుఁగాత

మలయ:— ఈ దుర్నిమిత్తమువలన నాహృదయము కంపిల్లు చున్నది.

జీ. కే — ఓయీ! జీమూతవాహనున కేమి?

సునం:— జీమూతవాహనునకుఁ గుశలమా? యని తెలిసి కొనుటకు విశ్వావసుమహారాజులుంగారు మీయొద్దకు నన్నుఁ బంపినారు. మహారాజుగారి కేమని విన్నవింపవలయునో యాజ్ఞాపింపుఁడు.

జీ. కే.— ఏమీ! మా కుమారుఁ డచ్చటికిని రాలేదా?

దేవి:— (విషాదముతో) మహారాజా! కుమారుం డక్కడను లేనిచో నింతసేపెచ్చటికిఁ బోయి యుండును?

జీ. కే:— నిక్కముగ నస్మత్ప్రాణయాత్రకై దూరమేగి యుండవచ్చును.

మలయ:— (తనలో) ఆర్యపుత్రుఁ డొకక్షణము కానుపింప కున్నను నామనమున నేలకో భయము కలుగుచున్నది.

సునం:— మాప్రభువుగారి కేమని మనవిచేయవలయునో సెలవిండు.

జీ. కే:— (ఎడమకన్నదరుట సూచించి) జీమూతవాహనుఁ డెందుల కాలసించెనో యనినేను కలఁతనొందుచుండ—

గీ॥ మా కనిష్టంబు సూచింప మాటిమాటి
కేలయదరెదవే? దక్షిణేతరాక్షి!
కుశలియేయగు మాపుత్రకుండు కానఁ
బాడునేత్రమ! యదరుట వ్యర్థమెయగు. 4

(పైకిఁజూచి) లోకైకనేత్రుండును, సహస్రకిరణుండు నగు నీ
సూర్యభగవానుఁడే నాపుత్రునికి శ్రేయము గలిగించును.
(ఆశ్చర్యముతో)
గీ॥ నేత్రదుస్సహమగుచును నిజమరీచి
ప్రభలఁబోలిన రక్తధారల విడచుచు
ప్రళయకంపిత తారకాభమగు వస్తు
విపుడు దివినుండి పడియెడు నెద్ది యొకొ ?
ఇది నాపాదములమీఁదనే పడినదే !

(అందఱును బరిశీలింతురు)

జీ. కే.— ఓహో ! రుధిరార్ద్రమాంసకేశములతోఁ గూడిన
యీచూడామణి యెవ్వరిదై యుండును ?

దేవి :— (విషాదముతో) ఇది నాపుత్రుని చూడామణివలె
నున్నది.

మలయ :— అటులనఁగూడదు.

సునం :— మహారాజా ! తత్త్వమును బరిశీలింపకయే వైక్ల
బ్యము నొందకుఁడు. ఇచ్చట—
గీ॥ వైనతేయుఁడుభక్షించుపన్నగముల
శిరములందలి మణులు చెచ్చెరను బెక్కు
ధూమకేతులవలె మహాభీమముగను
రాలుచుండును నిట్టివి ప్రతిదినంబు. 6

జీ. కే :— దేవీ ! యీతఁడు వచియించినమాట సయుక్తిక
ముగ నున్నది. ఒకవేళ నిట్లును గావచ్చును.

దేవి :— సునందా ! కుమారుఁడీవేళ కత్తవారియింటికిఁ జేరి
యుండునేమో ! తెలిసికొని త్వరితముగరమ్ము.

సునం :— చిత్తము. (నిష్క్రమించును)

జీ. కే :— దేవీ! యిది నాగచూడామణియై యుండునా?

(రక్తాంశుకములు ధరించి శంఖచూడుఁడు ప్రవేశించును)

శంఖ :—(కన్నీటితో) అయ్యో! యెంతకష్ట మెంతకష్టము!

గీ॥ వార్ధితీరగోకర్ణుని భక్తి మ్రొక్కి
శీఘ్రముగ వధ్యశిలను నేఁజేరినాఁడ
రొమ్ముచీలిచి విద్యాధరుని గరుడుఁడు
నెత్తికొనిపోయె వినువీథి నిప్పుడయయొ! 7

అయ్యో! నిష్కారణైకబాంధవా! అయ్యో! పరమ కారుణికా! అయ్యో! పరదుఃఖదుఃఖితా! ఎక్కడకుఁ బోయితివి? నాకుఁబ్రతివచనమిమ్ము. ఓరీ! శంఖచూడ హతకా! నీవేమిచేసితివిరా?

గీ॥ పన్నగత్రాణకీర్తి యుఁ బడయలేదు
శ్లాఘ్యమౌ ప్రభునానతి సలుపలేదు
పరునిచేతను రక్షింపఁబడితి వకట!
శోచ్యుఁడవు వంచితుండవు సుమ్మునీవు. 8

ఇట్టి నేను క్షణమాత్రము జీవించియైనను నాయాత్మను బరిహాసాస్పదముగ నొనరించుటకు సమ్మతింపను. వీని ననుసరించుటకు యత్నింతును. (నడచుచు నేలయందు దృష్టిప్రసరింపఁజేసి)

సీ॥ ముందు సంఘాతమునఁ బృథులంబునై
ప్రవిరళపతితమై యువల స్థూల
బిందుయుతంబయి వెలసి పాషాణ ఘా
తవిశీర్ణసంవ్యాప్తతనుకణములు

స్థలులందుఁ గీటకసంకీర్ణమయి ధాతు
భిత్తుల మర్లక్షవిధి వహించి
ఘనతరుశిఖరాల గహ్వరంబుల ఘుసీ
భూతరూపముఁదాల్చి పొలుపుమీఱు

గీ॥ నీ రుధిరధార నిమ్నోడ నేను సూక్ష్మ
బుద్ధిఁ బరిశీలనంబును బొనరఁజేసి
పన్నగవిరోధి యెచ్చటనున్నవాఁడొ
యచటికే పోయెదను శీఘ్రయానమునను. 9

దేవి :—(భయముతో) మహారాజా! యెవ్వరో తలవంచికొని త్వరితముగ నిటు వచ్చుచున్నారు. వీనిని జూచినతోడనే నాహృదయము మిక్కిలి కలఁతనందుచున్నది. ఈతఁ డెవఁడో తెలిసికొనవలయును.

జీ. కే.— దేవీ! అట్లే యొనరింతును.

శంఖ :—(ఆక్రందనంబొనరించుచు) అయ్యో! త్రిభువనైక చూడామణీ! ఎక్కడనుంటివి? నిన్నెక్కడఁజూతును? హా! అపహృతుఁడను. అపహృతుఁడను.

జీ. కే.— (విని సంతోషముతో] దేవీ! దుఃఖింపకుము. ఈచూడామణి యీతనిదే. మాంసఖండమని భ్రమపడి యేదోయొకపక్షి శిరమునుండి యెత్తుకొనిపోవుచుండఁగా నిందుఁబడియుండునని తోఁచుచున్నది.

దేవి :—(హర్షముతోమలయవతిని గౌఁగిలించుకొని)కళ్యాణీ! ధీరవుకమ్మ. ఇట్టి నీయాకారము వైధవ్యదుఃఖ మనుభ వింపదుకద?

మలయ :— అమ్మా ! నీయాశీర్వచనప్రభావమువలన నటులే యగును. (పాదములంబడును)

జీ. కే :— (శంఖచూడునిసమీపించి) వత్సా ! నీచూడామణి యపహృతమయ్యెనా ?

శంఖ :— నాయొక్కనిచూడామణియేకాదు, త్రిలోకచూడామణి యపహృతమైనది.

జీ. కే :— ఎట్లు ?

శంఖ :— దుఃఖాతిరేకమువలన బాష్పములు కంఠమును నిరోధించుచుండుటచేతఁ జెప్పఁజాలకున్నాఁడను.

జీ. కే.— (తనలో) అయ్యో ! హతుఁడనైతిని.

(ప్రకాశముగ)

గీ॥ తెల్పుమా పుత్ర ! దుఃఖమాత్మీయమైన
దాని నతిదుస్సహంబయి తనరుదానిఁ
గొంత నాయాత్మయందు సంక్రాంతమగుచు
సహ్యమగు నీదువేదన సత్యమిపుడు. 10

శంఖ :— వినుఁడు. నేనుశంఖచూడుఁడను పేరుగల సర్పమును. వంతుచొప్పున వాసుకి యాహారమునకై గరుత్మంతుని యొద్దకు నన్నుఁబంపెను. చేటభారతమంతయు నెందులకు? ఈ కథయంతయు నామూలాగ్రముగఁ జెప్పుచుండినచో నీరుధిరధారాపద్ధతి ధూళిచేత నావృతమై కానుపింపక పోవునేమో? కావున సంక్షేపముగఁ బ్రధానాంశమునుజెప్పెదను.

కం॥ కరుణాసింధువు విద్యా
ధరుఁడెవ్వఁ డొయొక్కఁ డాత్మదానము నిపుడా

గరుడునకుఁ జేసి దయతో
సరగున నాప్రాణములను సంరక్షించెరా. 11

జీ. కే.— (విషాదముతో) ఈ విధముగఁ బరహితవ్యసని యగు నితరుఁ డెవ్వఁడు కలఁడు? కుమారజీమూతవాహనుఁడేయని స్పష్టముగనే వచింపుము. అయ్యో! మంద భాగ్యుఁడను. హతుఁడను.

దేవి :— అయ్యో! పుత్రకా! యెంతపనిచేసితివి నాయనా!

మలయ :— అకటా! నామనమున నుదయించిన దుశ్చింతనము సత్యమె యయ్యెనుగద!

(అందఱును మూర్ఛిల్లుదురు)

శంఖ :— (కన్నీటితో) ఓహో! నిక్కముగ వీరామహాసత్త్వుని తలిదండ్రులేయగుదురు. అప్రియమును నివేదించి నేను వీరి కిట్టియవస్థ కలిగించినాఁడను. అయినను విషధరముఖము నుండి విషముగాక వేఱొకటి యెట్లు బయలువెడలును? ఆహా! ప్రాణప్రదుండగు జీమూతవాహనుని కీ శంఖ చూడుఁ డుచితరీతిని బ్రత్యుపకార మొనరించినాఁడు. కావున నిపుడే యాత్మహత్య గావించుకొందునా? వలదు. వీరి నోదార్తును. తండ్రీ! యూరడిల్లుము. తల్లీ! యూరట నొందుము.

(ఇరువురు నూరటనొందుదురు)

దేవి :— బిడ్డా! లెమ్ము. దుఃఖింపకుము. జీమూతవాహనుఁడు లేనిచో మనముమాత్రము జీవింపఁగలమా? ఇప్పటి కూరడిల్లుము.

మలయ:— (ఊరడిల్లి) హా! ఆర్యపుత్రా! నిన్నెచ్చటఁ గాంతును?

జీ. కే.— అయ్యో! కుమారా! గురుచరణశుశ్రూషా పరాయణా!

గీ॥ అయ్యయో! పుత్ర! నీవులోకాంతరమున
కరుగుచుండియు నస్మదీయాంఘ్రులందె
యీశిరోమణిఁబడవైచి యిపుడు వినయ
పద్ధతిని వీడకుంటివి భక్తిపరత. 12

(చూడామణినిగ్రహించి) హా! వత్సా! యీచూడామణి మాత్రమేనాకుఁ గానుపించుచున్నది. ఇఁకనిన్నుఁజూచు భాగ్యమునాకులేదేమోకద! (మణిని హృదయమున నిడుకొని) అహాహా!

గీ॥ భక్తిని మదీయచరణాభివందనంబు
సలుపుచోఁ బాదయుగళకషణముచేత
మసృణమయ్యెను నీశిరోమణిమదీయ
హృద్విదారణమొనరించు నెట్టునొక్కొ? 13

దేవి:— అకటా! పుత్రకా! జీమూతవాహనా! గురుజన శుశ్రూషకంటె నితరసుఖములయం దభిరుచిలేని నీ విపు డెటులు పితరులనువిడచి స్వర్గసౌఖ్య మనుభవింపనేగితివి?

జీ. కే.— (కన్నీటితో) దేవీ! జీమూతవాహనుఁడు లేనిచో మనముమాత్రము జీవింపఁగలమా! ఇటులు విలపింతువేల?

మలయ:— (జీమూతకేతుని యడుగులఁబడి బద్ధాంజలియై) మామగారూ! ఆర్యపుత్రుని చూడామణి నాకొసంగుఁడు.

దీనిని హృదయముననిడుకొని యగ్నిప్రవేశ మొనరించి నా సంతాపమును బోఁగొట్టుకొందును.

జీ. కే.— (కన్నీటితో) పతివ్రతాశిరోమణీ! నన్నాకుల పెట్టకుము. మనకందఱకును నిదియేకదా కర్తవ్యము!

దేవి :— మహారాజా! ఇంకను నాలసించుటెందులకు?

జీ. కే.— ఆహితాగ్నియగువాని కితరాగ్నులవలన సంస్కారము శాస్త్రసంమతముగాదు. కావున నగ్నిహోత్రగృహము నుండి యగ్నులను గొనివచ్చి వహ్నిప్రవేశ మొనరింతము.

శంఖ :— (తనలో) అయ్యో! యెంతకష్టము! పాపాత్ముఁడనగు నాయొక్కనిమూలమున నీ విద్యాధరకులమెల్ల నశించును గదా! కావున నిట్లు పలికెదను. (ప్రకాశముగ) అయ్యా! ఇందలి తత్త్వమును బరిశీలింపకయే యిట్లు సాహసకృత్య మొనరించుట యుక్తముగాదు. విధివిలసితము లతి విచిత్రములు. ఒకవేళ నాగముకాదని తెలిసికొని జీవించి యుండఁగనే జీమూతవాహనుని గరుత్మంతుఁడు విడిచిపుచ్చ వచ్చును. కావున నీ రుధిరధారవెంబడినే వైనతేయుని యొద్దకుఁ బోవుదము.

దేవి :— దైవానుగ్రహమువలన జీవించియుండఁగనే నాపుత్రునిఁ దప్పక చూతును.

మలయ :— (తనలో) మందభాగ్యురాలనగు నాకిది దుర్లభము కదా!

జీ. కే.— ఓయీ! నీవాక్యము తథ్యమేయగుఁగాత. అయినను వహ్నులఁ దీసికొనిపోవుటయే యుచితము. కావున నీవు

ముందునడువుము. మేమును నగ్నిహోత్రగృహమునుండి యగ్నులఁ దీసికొని యతిత్వరితముగ వచ్చెదము.

(పత్నీవధూసమేతుఁడై జీమూతకేతువు నిష్క్రమించును)

శంఖ :— ఇఁకగరుత్మంతు ననుసరింతును. (నడచి యెదుట గుర్తించి) ఓహో!

మ॥ క్షతజార్ద్రీకృతచంచుకర్షణముల న్సానుల్మహా ద్రోణులౌ
గతి, నేత్రాగ్నులఁ భ్రాంతకాననము దగ్ధంబౌవిధింజేయుచున్
దతమజ్జత్ప్రికఠోరవజ్రనఖరాంతంబులే భువిన్గాఁడఁగా
నతిదూరంబుగఁగానుపించుగరుడుండాగందపుంగొండపై. 14

(ఆసనస్థుఁడై గరుత్మంతుఁడు ప్రవేశించును. జీమూతవాహనుఁ డెదుటఁబడి యుండును)

గరు :— (తనలో) ఆహా! యేమివింత! జన్మించినది మొదలు కొని భుజగపతుల నెందఱనో భక్షించితిని. కాని యిట్టి యాశ్చర్యమెపుడును గాంచియుండలేదు. ఈమహాసత్త్వుఁడు బాధనొందకుండుటయేగాక సంతుష్టాంతరంగుఁడై నట్లును గానుపించుచున్నాఁడు.

సీ॥ సారిది దేహస్థితశోణితమెల్లను
దాగిన గ్లాని సుంతయుఁ గలుగదు
పలలఖండనజన్యబాధనొందిన మోము
ప్రీతిఁ బ్రసన్నమై వెలయుచుండు
మిగిలినదేహముమీఁదఁ బులకములు
స్పష్టముగాఁ గానఁబడఁదొడంగె
నింతింతయనరాని యెగ్గొనర్చిన నన్ను
నుపకారివలెఁజూచు నోర్మితోడ

గీ॥ ధైర్యసాగరుఁడైన యీతని ప్రవృత్తి
యద్భుతంబుగఁ దోఁచెడి నహహా ! నాకుఁ
గాన భక్షింపఁగానొల్ల వీని నెవ్వఁ
డో ! యితఁడు కనుగొందును నీయదనున. 15

(దూరముగఁ బోవును)

జీ. వా.— (మాంసఖండనవిముఖునిగ గరుత్మంతు నుపలక్షించి)

గీ॥ రక్తము స్రవించు నిపుడు సిరాముఖముల
నామిషం బింక నా దేహమందుఁ గలదు
ఇంతకును నీవు తృప్తి వహింపలేదు
భక్షణంబేల మానితి వైనతేయ ? 16

గరు :— (తనలో) ఆహా ! యెంతయాశ్చర్యము ! ఇట్టి యవస్థయందును నీతఁ డతూర్జితముగఁ బలుకుచున్నాఁడు. (ప్రకాశముగ)

గీ॥ నీ హృదంతరమునుండి నేను రక్త
మును గ్రహించితిఁ గొంచెము ముక్కుచేత
నీవు ధైర్యముచే నాదుహృదయమును హ
రించినాఁడవుకద ! జగత్త్రితయవంద్య ! 17

కావున నోమహాత్మా ! నీవెవ్వరవో తెలుపఁగోరుచున్నాఁడ.

జీ. వా.— ఇటు లాఁకలిచేఁ బీడింపఁబడుచుండి వినరాదు. నామాంసశోణితములచేతఁ దృప్తివడసి యావలఁ దెలిసికొనుము.

శంఖ :— (త్వరితముగసమీపించి) వలదు. వలదు. సాహసము వలదు. ఈతఁడు నాగముకాఁడు. వీనిని విడువుము.

నన్ను భక్షింపుము. వాసుకి యాహారమునకై నన్నే నీయొద్దకుఁ బంపెను. (వక్షమర్పించును)

జీ. వా.— (శంఖచూడునిఁజూచుచు విషాదమునఁ దనలో) అకటా! శంఖచూడుఁడు వచ్చుటవలన నామనోరథము విఫలమయ్యెఁగదా!

గరు:— (ఇద్దఱను బోల్చిచూచుచు) మీయిరువురికిని వధ్య చిహ్నము కానుపించుచుండుటచే నాగమెద్దియో తెలిసి కొనఁజాలకుంటిని.

శంఖ:— నీవు భ్రాంతినొందుటకు నిమిత్తమేలేదే!

సీ॥ ఇమ్మహాపురుషుని ఱొమ్మునఁగల స్వస్తి
కాంకము మునుఁగుచే నగుపడకయు
నుండవచ్చును. గాని యొగి నాదు దేహంబు
పైఁగూసమైనఁ గన్పడద నీకు?
మాటలాడుచునున్న మామక జిహ్వాద్వ
యంబేని గణియింపవై తివకట!
అత్యంత తీవ్ర విషాగ్నిధూమ సమూహ
విచ్ఛాయరత్న ప్రభాచ్ఛటలును,
గీ॥ దుస్సహ విషాద శూత్కృత తూర్ణవాయు
వివృతప్రాంత భాగంబులై వెలయునట్టి
యీఫణంబులు మూడింటినేనిఁ జూచి
సర్పమిదియంచుఁ దెలియఁగఁజాలుదుకద! 18

గరు:— (శంఖచూడుని ఫణములను, జీమూతవాహనుని జూచుచు) నేను హింసించిన యీతఁడెవ్వఁడు?

శంఖ :—ఓ! విద్యాధరరాజవంశతిలకా! కరుణాసముద్రుండ వయ్యు నీవిట్టి నిష్ఠురకార్య మెటులొనరించితివి?

గరు :—ఓహో! విద్యాధరకుమారుండగు జీమూతవాహనుం డితఁడేనా!

సీ॥ సురల కాశ్రయమయి శోభిల్లు మేరుభూ
ధరమందు, మందరదరులయందుఁ,
బ్రాలేయపర్వత ప్రస్థంబులందు, మ
హేంద్రాచలంబున, నీశ్వరునకు
నిత్యనివాసమై నెగడు కైలాస శి
లాతలంబులయందు, లలితమలయ
ప్రాగ్భారదేశాల, వరుస నాయాదేశ
ములయందు నెప్డు బహుళముగాను
గీ॥ జక్రవాళపర్వతమున సంచరించు
చారణగణంబు సతతము శ్రావ్యముగను
గానమొనరింప నెవ్వాని ఘనయశంబు
వినఁబడుచునుండునో నాకు ననవరతము
నట్టి విద్యాధరుఁడె యీతఁడౌను నిజము. 19

అయ్యో! నేను సంపూర్ణముగ నపయశఃపంకమున మునింగితిని గద!

జీ. వా.—ఫణిపతీ! యిటులావేగము నొందనేల?

శంఖ:—ఏమీ! ఇంకను నావేగపడనక్కఱలేదా? చూడుము.

గీ॥ తావకీనదేహార్పణఁ దార్ఢ్యవలన
నాశరీరము రక్షించి నన్ రసాత

లంబుకంటె నధోలోకలగ్నుఁజేయ
ధర్మమగునయ్య ! నీకు నుదారచరిత ! 20

గరు:— ఓహో ! దయార్ద్రచిత్తుఁడగు నీమహాత్ముఁడు మదీయాస్యగోచరంబయిన యీ పన్నగప్రాణములను రక్షించుటకై స్వదేహంబునే నాకాహారముగ నర్పించెనుగద ! నేను మహత్తరమగు దుష్కార్య మొనరించితిని. వేయేల! భగవానుఁడగు బుద్ధమునినే నేను హింసించినాఁడను. ఈ ఘోరపాపమున కగ్నిప్రవేశముకంటె నితరమగు ప్రాయశ్చిత్తము లేదు. వహ్నిలభించు నుపాయ మెయ్యది? (దిక్కులు పరికించి) ఓహో! ఎవ్వరోకొంద అగ్నినిదీసికొని యిటేవచ్చుచున్నారు. వీరి రాక కెదురు చూతును.

శంఖ :— కుమారా ! నీ తలిదండ్రు లరుదెంచినారు.

జీ. వా.—(తొందరగ) శంఖచూడా! రమ్ము. కూరుచుండుము. ఈ యుత్తరీయముచేత నాశరీరమునుగప్పి దగ్గఱనుండి నన్నుఁ బట్టుకొనుము. అటులొనరింపనియెడల నిట్టియవస్థలోనున్న నన్ను హఠాత్తుగఁజూచి మాతల్లి ప్రాణములు విడచునేమో?

(శంఖచూడుఁడు ప్రక్కనున్న యుత్తరీయమును గప్పును)

(పత్నీవధూసమేతుఁడై జీమూతకేతువు ప్రవేశించును)

జీ. కే.— (కన్నీటితో) హా ! పుత్రా ! జీమూతవాహనా !

సీ॥ వీఁడు నావాఁడగు వీఁడు పరుండగు
నను భిద లేదు దయాపరునకు
సర్వభూతహితంబు సలుపుట యుక్తమే
యగుట దీనను దోష మరయ లేదు

ఒక్కని రక్షించుటొప్పునా ? లేక పె
క్కురఁ గాచు టుచితమా ? కూర్మిమీఱ
నను చింత యుదయింపదయ్యె నీకక్కట !
ఖగనాథువలనఁ బన్నగముఁ గావ

గీ॥ స్వీయప్రాణార్పణంబును జేయుచున్న
నీవలన నీవు, పితరులు, నీవధువును
నిది యది యనంగ నేటికి? నిపుడు చక్ర
వర్తి కులమెల్ల హతమయ్యె బాధముగను. 21

దేవి :— (మలయవతినుద్దేశించి) బిడ్డా! ఒకక్షణము దుఃఖము మానుము. నిరంతరధారగఁబడుచున్న నీ కన్నీటి బిందువుల చేత నీయగ్ని చల్లారుచున్నది.

(అందఱును నడతురు)

గరు :— 'హా ! పుత్రా! జీమూతవాహనా!' యనుచున్నాఁడు. నిక్కముగ నీతఁడు వీని తండ్రియే. పుత్రఘాతియగు నామోమును సిగ్గుచే వీనికిఁ జూపఁజాలను. అయిన నగ్ని కొఱకు నిరీక్షించుట యెందులకు ? జలధితటంబుననె యుంటినిగద! కావున నిపుడే—

సీ॥ జ్వాలాపరిభంగ సంవలితముల్, త్రైలోక్య
గ్రసనాగ్రహ చలత్కరాళకాల
జిహ్వాగ్రకల్పముల్, శీఘ్రసర్పణములు,
త్పాతవాతవ్యాప్తి పటుతరములు,
నగు స్వీయపక్షవాతావళులను వివ
ర్ధితమయి సప్తవారిధుల నొక్క

కంకణంబునువలెఁ గబళీకరింపఁగఁ
జాలుచుఁ గల్పావసానవహ్ని
గీ॥ వలె భయంకరమైన యీ బాడబాగ్ని
యందుఁ బడి నేనొనర్చినయట్టి పాప
మునకుఁ దగిన ప్రాయశ్చిత్త మనుభవింతు
వహ్నికై వేచియుండుట పాడిగాదు. 22

(లేవఁజూచును)

జీ. వా.— పతంగాధిరాజా! ఈప్రయత్నము మానుము. ఈ పాపంబున కిది ప్రతిక్రియకాదు.

గరు :— (మోఁకరించి, బద్ధాంజలియై) మహాత్మా! అర్హ ప్రతీకారంబును సెలవీయఁగోరుచున్నాను.

జీ. వా.— ఒకక్షణము నిరీక్షింపుము. నా తలిదండ్రులు వచ్చి యున్నారు. వారికి నమస్కరింతును.

గరు :—అటులే కానిమ్ము.

జీ. కే.— (చూచి హర్షముతో) దేవీ! అదృష్టవశమున వర్ధిల్లు చున్నావు. వీఁడుగో! వత్స జీమూతవాహనుఁడు జీవించి యుండుటయేగాక యెదుటఁ గృతాంజలియగు గరుత్మం తునిచేత శిష్యునిచేవలె సేవింపఁబడుచు క్షేమముగనున్నాఁడు.

దేవి:— మహారాజా! అక్షతశరీరుఁడగు పుత్రకుని ముఖమును జూచుభాగ్యము లభించుటచేత నేను గృతార్థురాలనైతిని.

మలయ:— నిక్కముగ నే నార్యపుత్రునిఁ జూచుచుండియు నసంభావ్యమనియెంచి విశ్వసింపఁ జాలకుంటిని.

జీ. కే.—(సమీపించి) వత్సా! రారమ్మ. నన్నుఁగౌఁగిలించు కొనుము.

(జీమూతవాహనుఁడు లేవనుద్యుక్తుఁడై పడి, మూర్ఛిల్లును. ఉత్తరీయము తొలఁగును)

శంఖ:— కుమారా ! ఊరడిల్లుమూరడిల్లుము.

జీ. కే.— అయ్యో ! కుమారా ! నన్నుఁజూచియు విడచి పోదువా ?

దేవి:— హా ! పుత్రా ! నాతో మాటయైన నాడవేమి ?

మలయ :— హా ! ఆర్యపుత్రా ! గురుజనులను గూడ నీ వుపేక్షించితివిగద !

(అందఱు మూర్ఛిల్లుదురు)

శంఖ :—ఓరీ ! శంఖచూడా ! గర్భమునందే నీవు మరణింపక పోయితివి గదరా ! ప్రతిక్షణమందును మరణాధికమగు దుఃఖము ననుభవించుచుంటివి గదా !

గరు :— ఇదియంతయు నృశంసుఁడనగు నా యవిమృశ్యకారిత యొక్క విలాసమే. కావున నీపాటి యుపకారమైన నొన రింతును. (ఱెక్కలచే విసరును) ఊరడిల్లుము. మహాత్మా ! ఊరడిల్లుము.

జీ. వా.— (ఊరడిల్లి) శంఖచూడా ! గురువుల నోదార్పుము.

శంఖ :— (సమీపించి) తండ్రీ ! ఊరడిల్లుము. అమ్మా ! ఊఱటనొందుము. జీమూతవాహనుఁడు మూర్ఛతేఱి నాఁడు. మీరుచూడలేదా ! మఱియు మిమ్ముల నోదా ర్చుట కుపవిష్టుఁడై యున్నాఁడు.

(ఇద్దఱు నూరట నొందుదురు)

దేవి :— అయ్యో! బిడ్డా! మేముచూచుచుండఁగనే కృతాంత హతకునిచేత నపహరింపఁబడుదువా ?

జీ. కే.— దేవీ ! ఇటు లమంగళవాక్యములు పలుకకుము. చిరంజీవి జీవించియేయున్నాఁడుగద! కోడలు నోదార్పుము.

దేవి :— (చేలచెఱఁగు మోముపై నిడుకొని దుఃఖించుచునే) అమంగళము ప్రతిహతమగుఁగాత. దుఃఖింపను. బిడ్డా! ఊరడిల్లుము. ఇప్పటికి నీభర్తమోమును జూడఁగలుగు భాగ్యము లభించుటయే కొంచెముమేలు.

మలయ :— (ఊరడిల్లి) హా ! ఆర్యపుత్రా ! మందభాగ్యరాలను నేనేమిచేయఁగలను ?

దేవి :— (మలయవతీముఖమును హస్తముచే నిమిరి) బిడ్డా! ఇటు లశ్లీలవాక్యములు పలుకకుము. ఈయాపద ప్రతిహతమగుఁగాత.

జీ. కే.— (కన్నీటితో)

గీ॥ అంగములు లుప్తమగుటచే నాశ్రయంబు
లేమిచేఁ బలెఁ గంఠసంశ్లిష్టమైన
ప్రాణములు దాల్చియున్న పుత్రకునిఁ గనియు
వేయిఖండములుగ నేను వ్రీలనైతి
నెంతపాపాత్ముఁడనో కాని యెఱుఁగనుగద ! 23

మలయ :— ఆర్యపుత్రుని యీ యవస్థనుగాంచియుఁ బ్రాణంబులు వీడకుండిన నే నతిదుష్కరకార్య మొనరించుచున్న దానను.

దేవి :— (జీమూతవాహనుని యంగములఁ బరామర్శించుచు

గరుడునితో) కూఁతురాధమా! నవయౌవనసౌందర్య సంపూర్ణమై త్రిలోకమనోహరంబగు నాపుత్రికుని శరీర మిట్టి యవస్థపాలు గావించుటకు నీమనం బెట్టులు సమ్మతించెను?

జీ. వా.— తల్లీ! అటులనకుము. ఈతఁడేమిచేసెను? ఈశరీర పరమార్థస్వరూప మిట్టిదేకదా! చూడుము.

గీ॥ త్వక్పరివృతంబు బీభత్సదర్శనంబు
శుక్లశోణితమాంసాద్యశుచి పదార్థ
పూరితంబైన యీ దేహమునను నెట్టి
శోభయునులేదు నిక్కము సుమ్ము జనని. 24

గరు :— మహాత్మా! నాయాత్మ నరకానలజ్వాలావలీఢ మగుచున్నది. నేనిఁక నిలువఁజాలను. కావున దయతో నా కీ పాప ముపశమించు నుపాయ ముపదేశింపుము.

జీ. వా.— తండ్రీ! నీనిపాపమునకుఁ బరిహారమును జెప్పెదను. సెలవొసంగుము.

జీ. కే.— వత్సా! అటులేకానిమ్ము.

జీ. వా.— వైనతేయా! వినుము.

గరు :— (మోఁకరించి కృతాంజలియై) ఆజ్ఞాపింపుఁడు.

జీ. వా.—

సీ॥ భువి "నహింసాపరమోధర్మ" యను సూక్తి
హృదయపేటికయందుఁ బదిలపఱచి
సతతము ప్రాణిహింసను మానుమీ! మనో
వాక్కాయ కర్మలవలన మున్నొ
నర్చిన పాపంబునకును బశ్చాత్తాప
మును వహింపుము సర్వభూతములకు

భయముఁ గల్గింపక పదపడి పుణ్యప్ర
వాహవృద్ధినిఁజేయఁ బాటుపడుము

గీ॥ పరిమితప్రాణిహింసచేఁ బ్రాప్తమయిన
పాపలేశ మీపుణ్యాబ్ధిఁ బడి నశించు
నపరిమితజలపూర్ణ హ్రదాంతరాళ
పతితలావణఖండంబువలె నిజంబు. 25

గరు:—గీ॥ ఇప్పుడజ్ఞాన నిద్రాశయితుఁడనైన
నన్ ప్రబోధించి తీవు విన్నాణివగుచు
నేఁటినుండియు సర్వప్రాణివధములను
మానివేయుదు. నిజము. ముమ్మాటికిఁకను. 26

ఇపుడు—

సీ॥ పులినవిపులములౌ భోగబృందములచే
నొక్కచో ద్వీపంబునోజఁగాంచి
వలయాకృత శరీరములచేత నొక్కెడ
నావర్తకభ్రాంతి నావహించి
గట్టుగట్టునకును గడఁకమైఁ దిరుగుచు
నాగిసేతు విధిఁదాల్చి యొక్కయిక్క
వ్యాళసంఘం బిమ్మహాబ్ధిని సుఖముగ
విహరించుఁగావుత వేడ్కమీఱ
నదిగాక, సస్త్రములగుచుఁ బాతాళ ల
గ్నములును దిమిరసంఘ నిభములును
నగు కేశపాశముల్ తగఁదాల్చి సింధూర
లిప్తంబులౌగతి ప్రేతయొండ

చే నెఱ్ఱవాఱిన చెక్కులు వహియించి
యాయాసపరిమంథరాంగులయ్యెఁ

గీ॥ గష్టములు లెక్కసేయక కడఁగి నాగ
కాంత లీచందనద్రుమకాననమున
రక్తితో నీదుకీర్తిని శ్రావ్యముగను
గానమును జేయుదురుగాత జానుమీఱ. 27

జీ. వా.— సెబాసు ! మహాసత్త్వా ! సంతసించితిని. తప్పక దృఢనిశ్చయుఁడవై యుండుము. (శంఖచూడునిఁగూర్చి) అయ్యా ! నీవు నీగృహమున కరుగుము.

(శంఖచూడుఁడు నిశ్వసించి తలవంచును)

జీ. వా.— (నిట్టూర్పువిడచి తల్లిఁజూచుచు)

గీ॥ పన్నగవిరోధిచే నీవు బన్నమొంది
యుందువనుచు మనంబున నూహసేసి
తనయ వత్సలయగు నీదుతల్లి మిగుల
శోకసాగరమగ్నయాఁజుమ్మి నిజము. 28

దేవి :— గరుత్మంతుని బారిఁబడియు నక్షతశరీరుండగు కుమారునిఁ జూచుభాగ్యము లభించుటచేత నామెయే ధన్యురాలు.

శంఖ :— అమ్మా ! కుమార జీమూతవాహనుండును సుఖమైనచో నీమాట సత్యమేయగును.

జీ. వా.— (బాధనునటించుచు) అయ్యో ! బాధ. బాధ. పరార్థసంపాదనామృతరసాస్వాదాక్షిప్తహృదయుఁడనగుటచే నింతవఱకును వేదన నెఱుంగఁజాలనైతిని. ఇపుడు వేదన నన్ను బాధింపఁదొడంగెను. [మరణావస్థ నటించును]

జీ. కే.— [తొందరతో] హా ! వత్సా ! ఇటులొనరించుచుంటి వేల ?

దేవి :— అయ్యో ! ఎట్టి విపరీతపరిణామము కలుగుచున్నది ? [బొమ్మబాదుకొనుచు] రక్షింపుఁడు. రక్షింపుఁడు. నాపుత్రుని యాపద తొలఁగింపుఁడు.

మలయ :—హా ! ఆర్యపుత్రా ! నన్నుఁ బరిత్యజింతువా ?

జీ. వా.— (చేతులు జోడింపయత్నించుచు) శంఖచూడా ! నాహస్తములు దగ్గఱఁజేర్పుము.

శంఖ :— (అటులొనరించుచుఁ గన్నీటితో) అయ్యో ! ఎంత కష్టము! జగం బనాథమయ్యెను గదా !

జీ.వా.— (కన్నులు సగము తెఱచి తలిదండ్రులను జూచుచు) తల్లిదండ్రులారా ! నా కడపటి నమస్కారమును బరిగ్రహింపుఁడు.

గీ॥ పట్టుదప్పె విచేతనావయవములను
స్పష్టముగ మాటలు వినంగఁబడవు చెవికిఁ
గన్నులును మూఁతవడియెను క్షణములోనఁ
బోవుచున్నవి నాప్రాణములును జనక ! 29

అయిన నిదియంతయు నెందులకు ? [ఈశరీర దానంబున (4. అం., 25 ప.) అనుపద్యము చదివి పడిపోవును]

దేవి :— హా ! వత్సా ! హా ! గురుజనవత్సలా ! హా ! జీమూతవాహనా ! మరల నిన్నెచ్చటఁజూతును తండ్రీ !

జీ. కే.— (కన్నీటితో) హా! పుత్రా! జీమూతవాహనా ! హా! ప్రణయిజనవత్సలా ! హా ! సర్వగుణనిధీ ! నాతో నొక్క-

మాటాడుము నాయనా ! (చేతులెత్తి) అయ్యో ! యెంత కష్టము ?

చం॥ ధరణినిరాశ్రయంబెయగు ధైర్యము, తా వినయంబు నెవ్వనిన్
శరణమునొందు? క్షాంతివహనక్షముఁడెవ్వఁడు? దానసక్తియు
న్విరతము, సత్యముస్నాతమునిక్కము, యెచ్చటికేగునోకదా!
కరుణయు,నీవులేమిని జగంబులెశూన్యములౌనుబుత్రకా! 30

మలయ :— (కన్నీటితో) హా ! ఆర్యపుత్రా ! నన్నువిడచి యెటకేగుచుంటివి ? ఓ ! నిర్దయురాలా ! మలయవతీ ! ఈ యవస్థను గన్నులారఁజూచుటకే కదా ! యింతవఱకు జీవించి యుంటివి.

శంఖ :— కుమారా! ప్రాణములకంటె నిష్టతమంబైన యీ ప్రియజనమును వీడి యెచ్చటికిఁ బోవుచుంటివి ? యీ శంఖచూడుఁడు తప్పక నిన్ననుసరించును.

గరు :— (ఉద్వేగముతో) అయ్యో ! యెంతకష్టము ! ఈ మహాత్ముఁడు మరణించెనుగద! ఇపు డేమిచేయుదును?

దేవి:— (కన్నీటితోఁ బైకిఁజూచి) ఓభగవానులారా ! లోకపాలకులారా ! అమృతము వర్షించి మాపుత్రుని బ్రతికింపుఁడు.

గరు:— (హర్షమునఁదనలో) ఓహో ! అమృతపదశ్రవణము వలన జ్ఞప్తికివచ్చినది. నా యపకీర్తియుఁ దొలంగు నని తలంతును. కావున నిపుడే దేవేంద్రుని యాచించి యమృతవర్షమునంజేసి జీమూతవాహను నొక్కనినే గాక, పూర్వ

భక్షితములై శల్యావశిష్టంబులగు నాశీవిషంబులను సయితము బ్రదికింతును. ఒకవేళ నింద్రుఁ డమృతము నొసంగఁడేని—

చం॥ అతిజవపక్షవాయుహతినబ్ధిఁగలంచి ప్రచండనేత్ర వ
హ్నితతుల నగ్నిసూర్యులను నీఱొనరించియుఁ ద్రోటిచేత నా
శతధృతిహూత వజ్ర యమదండ కుబేరగద ల్నలంచి యొ
క్క త్రుటినిజేయువాఁడ నవగాఢధృతి న్నమృతంపువర్షమున్.

కావునఁ ద్వరితముగ నేగెదను.

(నిష్క్రమించును)

జీ. కే.— శంఖచూడా! ఇంకను నాలసింతువేల? కట్టెలఁ బ్రోగుచేసి నాపుత్రునికిఁ జితి పేర్పుము. మేము నీ చితి యందుఁ బడి యనుగమింతుము.

దేవి :— పుత్రకా! శంఖచూడా! త్వరితముగ సిద్ధపఱుపుము. మేము సహగమన మొనరింపనియెడల నీభ్రాత జీమూత వాహనుఁడు దుఃఖమునొందును.

శంఖ :— (కన్నీటితో) గురువుల యాజ్ఞ చొప్పున నటులే యొనరింతును. ఇందు నేనును మీకుఁ బురస్సరుఁడనేకదా! (లేచి చితిపేర్చును) తండ్రీ! చితి సిద్ధపఱిచితిని.

జీ. కే.—అయ్యో! కష్టము.

మ॥ తల నుష్ణీషము నూర్ణ కన్బొమలమధ్య న్గానఁగానయ్యెడిన్
జలజాతంబులఁబోలుకన్నులురమున్ స్పర్ధించు సింహంబుతో
నలిఁజక్రాంకిత మీపదద్వయము నైన న్నాదు పాపంబున
న్బలయుఁబండెదె! చక్రవర్తిపదము న్బ్రాపింపకే పుత్రకా!

దేవీ! దుఃఖించినఁ బ్రయోజనములేదు. లెమ్ము. చితి నారోహింతము.

(అందఱును నడతురు)

మలయ:—(అంజలి బంధించి పైకిఁజూచుచు) భగవతీ! గౌరీ! "విద్యాధరచక్రవర్తి నీకుభర్తయగు" నని సెలవిచ్చితివి కదా! మందభాగ్యురాలనగు నాయెడ నీవును నసత్యభాషిణి వైతివేమి?

(తొందరతో గౌరిప్రవేశించును)

గౌరి:— మహారాజా! జీమూతకేతూ! వలదు. వలదు. సాహసకార్య మొనరింపవలదు.

జీ. కే.— ఓహో! అమోఘదర్శనయగు గౌరీదేవి వచ్చినదే!

గౌరి:— (మలయవతినుద్దేశించి) వత్సా! మలయవతీ! నే నసత్యభాషిణి నెట్లగుదును? చూడుము.

(జీమూతవాహనునిపైఁ గమండలుజలము చల్లును)

వత్సా! జీమూతవాహనా! ఆత్మార్పణంబుఁ గావించియు లోకోపకార మొనరింప నుద్యుక్తుఁడవైన నీ యౌదార్యంబు నకు సంతసించితిని. లెమ్ము. చిరంజీవి వగుము.

(జీమూతవాహనుఁడు లేచును)

జీ. కే.— (సంతోషముతో) దేవీ! అదృష్టవశమున వర్ధిల్లు చున్నావు. మన జీమూతవాహనుఁ డక్షతశరీరుఁడై లేచి నాఁడు.

దేవి:— (హర్షముతో) భగవతియగు గౌరీదేవి యనుగ్రహము వలన నిట్టిభాగ్యము లభించినది.

(ఇరువురును గౌరిపాదములఁబడిలేచి జీమూతవాహనునిఁ గౌఁగిలించుకొందురు)

మలయ :— (సంతోషమున) అదృష్టవశమున నార్యపుత్రుఁడు సజీవుఁడయ్యెను. (గౌరియడుగులఁబడును)

జీ. వా.— (గౌరినిఁ జూచి బద్ధాంజలియై) భగవతీ!

గీ॥ వాంఛితాధికవరద! యో! భక్తజన మ
హార్తిహారిణి! విద్యాధరాధిదేవ
తా! శరణ్య! యోగౌరి! నీయంఘ్రిపద్మ
ములకు వేవిధములుగ నే మ్రొక్కులిడుదు. 33

(పాదములఁబడును)

(అందఱు పైకిఁజూతురు)

జీ. కే.— ఓహో! మబ్బులేకయే వర్షము కురియుచున్నదే! భగవతీ! యిదియేమి?

గౌరి :— మహారాజా! ఖగేశ్వరుఁడు పశ్చాత్తప్తుఁడై జీమూతవాహనుని, బూర్వభక్షితములై యస్థిశేషములైన యీయురగపతులను బ్రదికించుటకు దేవలోకమునుండి కురిపించిన యమృతవర్షమిది. (వ్రేలితోఁ జూపుచు) మఱియు నీవిషధరపతిసమూహము లక్షతదేహములై శిరములయందలి మణులు విరాజిల్ల నమృతరసాస్వాద లోభంబున జిహ్వాగ్రములచే నేలను నాకుచు, మలయగిరినదీ ప్రవాహములవలె సంపూర్ణవేగముతో, సహజవక్రగమనంబులచే సముద్రమునఁ బ్రవేశించుచున్నవి.

(జీమూతవాహనునితో) వత్స! జీమూతవాహనా! లోకోపకారపారీణుఁడవగు నీకుఁ బ్రాణదానము గావించుట మాత్రమేచాలదు. మానసోత్పన్నములును, స్వేచ్ఛా

నిర్మితరత్నకుంభనిహితంబులును, నతి పావనంబులు నగు నుదకంబులచేత స్వయముగ నభిషేకించి యిపుడే నిన్ను విద్యాధరచక్రవర్తిగ నొనరింతును.

మఱియు నోచక్రవర్తీ! యీకాంచనచక్రము యుద్ధాదులయందు నీకగ్రేసరంబగుఁగాత. నాలుగు దంతముల యీవెల్లయేనుఁగు, నల్లనియశ్వము, మలయవతియును నీరత్నములను స్వీకరింపుము. నాచేఁ బ్రేరితులై మతంగదేవ ప్రభృతులగు నీవిద్యాధరపతులు చూడామణిమరీచిరచితేంద్రాయుధపంక్తులగుచు భక్తితాత్పర్యమున శిరములు వంచి నీకు నమస్కరించుచున్నారు. వత్సా! ఇంకను నీకేమి కావలయునో కోరుము.

జీ. వా.—(మోఁకరించి) ఓ! ప్రియకారిణీ! ఇంతకంటెను బ్రియమేమి కలదు?

సీ॥ శంఖచూడుఁడు ఖగేశ్వరుబారినుండి సం
రక్షితుండయ్యె గారవముమీఱ
వైనతేయుండును దాను వినీతుఁడై
పూర్వభక్షితసర్పములను మనిచె
నేనుజీవించుట నీ తలిదండ్రులు
ప్రాణముల్ వీడక బ్రిదికి రిపుడు
భవదనుగ్రహభాగ్యవశమునఁ జక్రవ
ర్తిత్వము లభియించెఁ బ్రియముగలుగ
గీ॥ ఘోరతపముల నొనరించు వారికైన
దర్శనమొసంగనట్టియో తల్లి! నిన్నుఁ

గాంచుచుంటిని నీనిని మించుకోర్కె
రొక్కటియులేదు. జననిరో! నిక్కముగను. 34

అయిన నిట్లగుఁగాత.

(భరతవాక్యము)

ఉ॥ నెమ్ములు త్రాఁడవింప, ధరిత్రి సస్యసమృద్ధిఁగాంచ, మే
ఘమ్ములు వృష్టిసేయుత సకాలమునన్, ముదిమత్సరంబులన్
సంమతిఁవీడి, పుణ్యములఁజల్పుచు, నాపదలెల్లఁ బాయఁగా
నిమ్మహిఁనిష్టబాంధవ సుహృత్తతిఁగూడి సుఖించుతం బ్రజల్

మఱియును:—

గీ॥ ఎల్లజగములు శుభముల నొసఁగుఁగాతఁ
బ్రాణులు పరోపకారపారీణు లగుత
దోషములకు నాశంబును దొరయుఁగాత
ఘనసుఖంబులు జనమెల్లఁ గాంచుఁగాత. 36

(అందఱును నిష్క్రమింతురు)

పంచమాంకము సంపూర్ణము

(నాగానందము సమాప్తము.)

శ్రీ శ్రీ శ్రీ

